*Issued*— 30-5-1957




# ANDHRA LEGISLATIVE ASSEMBLY DEBATES

# OFFICIAL REPORT

## SATURDAY, the 17th MARCH, 1956

## VOLUME IV—No. 5

*CONTENTS*



PRINTED BY SREE PANDURANGA PRESS, ELURU
FOR THE SUPERINTENDENT
ANDHRA GOVERNMENT PRESS
KURNOOL
1957
PRICE *6 annas.*

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY

**Saturday, the 17th March, 1956.**

The House met in the Assembly Hall, Kurnool at half past eight of the clock, Mr. Speaker (The Hon Sri R. Lakshminarasimham Dora) in the Chair

## I. QUESTIONS AND ANSWERS

### SHORT NOTICE STARRED QUESTION

*Elections to Second Class Panchayat Boards*

552—A

* N Q No 1203-A — Sri M NAGI REDDI :— Will the Hon the Minister for Local Administration and Prohibition be pleased to state :

The method of conducting the coming elections for the Second Class Panchayat Boards ?

The Hon Sri A B NAGESWARA RAO :—

Attention is invited to the rules published in the Andhra Gazette Extraordinary dated the 2nd March, 1956. These rules govern the conduct of elections to Class II panchayats. The elections to Class I Panchayats will be held by the system of secret ballot

### STARRED QUESTIONS

*Conduction of minor panchayat elections by secret ballot in the State*

553—

* 964 Q — Sri V. VESWESWARA RAO .— Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state :

(a) whether there are proposals with the Government to conduct the minor panchayat elections in the State by secret ballot , and

(b) if not the reasons therefor ?

The Hon. Sri A. B. NAGESWARA RAO .—

(a) The answer is in the negative.

(b) The cost of an election by a system of secret ballot will be too much for the means of an average Class II Panchayat. It is not possible for the Government to secure

the necessary personnel for doing polling duty, if elections to over 6500 Class II Panchayats are to be held by the system of secret ballot.

Sri M. NAGI REDDI — 1st Grade Panchayats కు రహస్య వోటింగు పద్ధతి అని అంటే, రెండవ తరగతి వాటికి కూడా ఎన్నికలు ఆవిధముగానే జరిపించడానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

The Hon Sri A. B. NAGESWARA RAO —రహస్య బాలటు పద్ధతితో నడపటానికి ప్రభుత్వం ఆలోచించలేదు. ఈ విషయము మొన్న ముఖ్య మంత్రిగారు బడ్జటు స్పీచిలో చెప్పారు ?

Sri M. NAGI REDDI :— రెండవ గ్రేడు పంచాయితీలకు రహస్యపు పద్ధతి కాకుండా బహిరంగముగా ప్రిసైడింగు ఆఫీసరు వద్దకు వెళ్ళి చెప్పడము అనే పద్ధతి చాలా ఇబ్బందులతో కూడి ఉన్నది. కాబట్టి ఈ రహస్య బాలటు పద్ధతి పెట్టడానికి ఎందుకు వెనుకంజ వేస్తున్నారు ? ఆర్థిక కారణము అంటే ఆ పంచాయితీల వద్ద వసూలుచేసి రహస్య పద్ధతి ఏర్పాటు చేయుటకు ప్రభుత్వం ఎందుకు పూనుకోదు.

The Hon. Sri A. B. NAGESWARA RAO :— ఆర్థికముగా కొంత వరకు పంచాయితీలు పెట్టుకున్నా కొంత ప్రభుత్వం భరించవలసి ఉంటుంది. ఈ సీక్రెటు బాలటింగు పెడితే 6500 పంచాయితీలకు అన్ని డిపార్టుమెంటుల స్టాఫను డిప్యూటు చెయ్యవలసి ఉంటుంది. అందుచేత చెయ్యడానికి సావకాశములేదు.

Sri M NAGI REDDI :— అక్కడక్కడ రహస్యపు పద్ధతిని జరపడానికి open పద్ధతిని జరపడానికి తేడా ఎంత ఉంటుంది అని ప్రభుత్వం భావిస్తున్నది? ఒక్కొక్క పంచాయితీకు ఎంత అవుతుంది ?

The Hon. Sri A. B. NAGESWARA RAO — Chief Minister గారు డబ్బు వ్యవహారము అంతా కనిపెట్టి మంచి పని చేశారు.

Sri PILLALAMARRI VENKATESWARLU :— రాష్ట్రములో ఉన్నట్టి డిపార్టుమెంటులన్నీ కూడా తీసుకువచ్చి ఈ పంచాయితీ బోర్డు ఎలెక్షన్సుకు నిలబెట్టాలని చెబుతున్నారు. ఈ 6000 పంచాయితీలకు ఒకే రోజున ఒకే నిమిషాన జరిపితేను కదా ! లేకపోతే బ్యాచెస్‌గా divide చేసి జరిపితే ఈ Secret Ballot పద్ధతిన ఎన్నికలు పెట్టడానికి వీలు ఉంటుందా ? అట్లు చేస్తారా ?

The Hon. Sri A. B. NAGESWARA RAO :— Struggle చేసి నప్పటికి కూడా most of the establishment దానితో నేఉంటే ఇతరపనులు వెనుక పడుతవి. కనుక ప్రభుత్వమునకు ఆ ఉద్దేశ్యములేదు.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :— దానివల్ల అనేకమైన దెబ్బలాటలు, తగాయిదాలు రాబోతూ ఉన్నవి అని మీకు తెలుసునా ? అవి avoid చెయ్యగలరా ? ఆపద్ధతి మారుస్తారా లేకపోతే ఎన్నికలకు ఖర్చు అగుతుందని elections మానివేస్తారా ?

The Hon Sri A. B NAGESWARA RAO .— అసలు ఇది ప్రజా స్వామ్యము. ఎలక్షన్సు మానివేయ తలచుకొనలేదు. దెబ్బలాటలు ఉంటే కొన్ని గ్రామాలలో ఉండవచ్చును. కాని మొత్తముమీద ఎక్కువగా ఉండవు అని నాఅభిప్రాయము.

Sri N. RAMULU :— సభ్యుల ఎన్నికలు అయిన తరువాత అధ్యక్షుని ఎన్నిక స్పెషలు ఆఫీసరు చేస్తారా, ప్రభుత్వ సిబ్బందియా లేక non-officials చేస్తారా ?

The Hon. Sri A. B NAGESWARA RAO :— రూల్సు ప్రకారము నడపబడుతుంది.

Sri B. RAMA REDDI :— Secret Ballot వల్ల ఎక్కువ ఖర్చు అవుతుందని అన్నారు. ఆర్థిక ఇబ్బంది అన్నారు Open గా జరిగితే ఊరూరా కొట్లాటలకు బందోబస్తుకు ఎక్కువ ఖర్చు అవుతుందని ఆలోచించారా ?

The Hon. Sri A B. NAGESWARA RAO.— ఇవన్నీ తీవ్రముగా ఆలోచించే Open Ballot పద్ధతి ఏర్పాటు చేసినాము. ముఖ్యమంత్రిగారు చెప్పినట్లు బండెలదొడ్డి లాంటిదానిలో పెట్టుట ఉదయం తొమ్మిది గంటలనుండి సాయంత్రం మూడు వరకు ఆడవారిని మగవారిని పెట్టడము చూచి ఆ బాధ చూడలేక దానికంటె better అని చెప్పి పెట్టాము. ఇది కూడా experiment చేసిన తరువాత అవసరమైతే మార్పు చేస్తుంది ప్రభుత్వం.

Sri B. RAMAKRISHNA REDDI·— Secret Ballot పద్ధతివల్ల ఇబ్బందులు ఉంటవేమో. ఆ విధముగా ఎందుకు చెయ్యకూడదు ?

The Hon. Sri A B. NAGESWARA RAO — నేను మొదటనే చెప్పానుగదా ఆర్థిక కారణంవల్ల వీలులేదని.

Sri S. VEMAYYA·— ఆర్థికంగా మేముభరిస్తామని పంచాయితీలు ముందుకు వచ్చినప్పుడు అటువంటి వాటికైనా రహస్యపు వోటింగు జరపడానికి ఉత్తర్వులు జారీ చేస్తుందా ప్రభుత్వం ?

The Hon. Sri A. B. NAGESWARA RAO·— అటువంటి ఉత్తర్వులు జారీ చెయ్యడానికి వీలులేదు. అన్ని పంచాయితీలకు ఒకే పద్ధతిన నడుపవలెనని ప్రభుత్వ అభిప్రాయము.

Sri M NAGI REDDI ·— ప్రెసిడెంటుగా ఒక మెంబరును పెడతామన్నారు. ఇదివరకు మెంబర్ల సీట్లు, వార్డులు అంతా Regional Inspector గారు చేసేవారు. గెజెటులో Publish అయ్యేది. అది లేకుండా చేశారు. జిల్లా పంచాయితీ ఆఫీసరుకు ఈ అధికారం ఇవ్వడము, ప్రకటన లేకుండా చెయ్యడం ఏ వార్డుకు ఎన్నిక అయినదో తెలియకపోవడం చాలా ఇబ్బంది కనుక Regional Inspector కు ఈ అధికారం ఇచ్చి త్వరగా జరుపడానికి ఏర్పాట్లు చేస్తారా ?

The Hon Sri A. B NAGESWARA RAO — పంచాయితీబోర్డులకు తెలుపకుండా ఏమీ చెయ్యడములేదు. తెలిపే చేస్తాము.

[17th March 1956

Sri V. VISWESWARA RAO — అధ్యక్షా ! ఎలెక్షన్లు జరపడానికిది ధనాభావం అని చెబుతున్నారు. వార్డులలో సభ్యులను ఎన్నుకొనవలసిన అవసరము ఉన్నది. ఏ వార్డులకు ప్రత్యేకించి ఎన్నికలు జరుపుతారు? ఒక్కచోట జరుపుతారా? డబ్బులేనికారణం వల్లను, ఎక్కువ staff వెయ్యవలసి వస్తుందనిన్నీ, ఈవిధముగా జరుపుతున్నాము అని అన్నారు. వార్డుల ప్రకారము వార్డులలో ఎన్నుకోవాలి. అందువల్ల ప్రతి ward కు కొంత staff కేటాయించవలసి ఉంటుంది. కాబట్టి Secret Ballot ద్వారా ఎన్నికలు జరపడము మంచిదేమో మంత్రిగారు గుర్తిస్తారా ?

The Hon Sri A B NAGESWARA RAO — వివరములు అన్నీ కూడా G O లో ఇమిడి ఉన్నవి. గౌరవ సభ్యులు దయచేసి చూడవలెనని ప్రార్థిస్తున్నాను.

Sri M. NAGI REDDI – మహిళను ఎన్నుకొనడమనేది పంచాయితీబోర్డు మహిళను ఎన్నుకొన్న తరువాత ఆమెకు కూడా ప్రెసిడెంటు ఎన్నికకు ఓటుఉంటుందా? లేక నామినలుగా ఉండడమనేదా ?

The Hon Sri A. B NAGESWARA RAO – మహిళకు ఓటు ఉంది. మహిళను co-opt చేసుకున్న తరువాతనే పంచాయితీబోర్డు ప్రెసిడెంటు ఎన్నిక జరుగుతుంది.

Sri M SATYANARAYANA RAJU .— డబ్బు ఎక్కువ అవుతుందని Open Voting అని అంటున్నారు. Open election conduct చేసేవారు ఒక రూములో రహస్యంగా ఎందుకు వోటు చేయించకూడదు? దానివల్ల ఏమి ఖర్చుఅవుతుంది?

The Hon Sri A B. NAGESWARA RAO — Ballot paper, Ballot Boxes, ఇతరవిధమైన సిబ్బంది కావలెను. Polling Clerk, ఆఫీసు కావలెను. ఇందంతా ఖర్చు అవుతుందన్న కారణంచేతనే Open Ballot పద్ధతి పెట్టలేదు.

Sri V. VISWESWARA RAO —ఇంతకు క్రితమే కొన్ని పంచాయితీలు ఎన్నికలు జరిపారు. మైలవరంలో జరిపారు. అక్కడ President కు ప్రత్యేకముగ ward కేటాయించికూడా పూర్వం ఉన్న 8 సీట్లమీదనే ఎన్నికలు జరిపారు. ఎందుకు అలా జరిపారు ? ఒక ప్రక్క ప్రెసిడెంటు సీటు కూడా ward లో విభజించాలనే నియామకము ఉన్నప్పుడు అది చెయ్యకుండా ఎందుకు జరిపారు ?

The Hon Sri A. B NAGESWARA RAO — వివరములు నాకు తెలియవు. గౌరవ సభ్యులు చెప్పారు కాబట్టి విచారిస్తాను.

Sri VAVILALA GOPALAKRISHNAYYA — ప్రెసిడెంటు రిజిగ్నేషను ఇవ్వడము జరిగింది. ఇదివరకు జనరలు ఎన్నికలలో వచ్చారు కాబట్టి మెంబరుగా ఉంటున్నారు. Bye election లో వచ్చిన వారితో President ఎన్నిక జరుపుతారా? లేకపోతే ఉన్నంత వరకు జరుపుతారా? ఎవరైనా Disqualify అయితే వారి seat fill up కాకుండానే President ఎలెక్షను జరుపుతారా లేక తరువాత జరుపుతారా ?

The Hon. Sri A. B. NAGESWARA RAO — పంచాయితీ మెంబ

గ్లను బట్టి Regional Inspector గాని I. G. L. గాని ప్రభుత్వాన్ని అడిగితే ప్రభుత్వం ఆలోచిస్తుంది. I G. L. Final Head. Powers delegate చేశారు. గౌరవ సభ్యులు ఎవరైనను ప్రభుత్వ నోటీసుకు తెస్తే ప్రభుత్వం చేస్తుంది.

Sri VAVILALA GOPALAKRISHNAYYA — ఎన్నికలు ఎలాగజరపాలన్నది పాలసీకి సంబంధించినది. Procedure విషయంలో ఆయనకు అధికారం ఇచ్చారు. పాలిసీ మీద కాదు మీ అభిప్రాయము ఏమిటి ?

The Hon Sri A. B. NAGESWARA RAO :— నా అభిప్రాయమునకు తావులేదు. Facts and Figures మీద నేను మాట్లాడుచున్నాను.

*Honorary Railway Magistrates in the State*

554—

*905 Q - Sri S. VEMAYYA :- Will the Hon. the Deputy Chief Minister be pleased to state :

[a] Number of Honorary Railway Magistrates in the State now ;

[b] Number of Harijans out of them, and

[c] The nature of Honororium paid if any now ?

The Hon Sri N. SANJEEVA REDDI —

[a] Six

[b] None

[c] The Railway Magistrates are not paid honororium of any nature.

Sri S. VEMAYYA .— ఈ రైల్వే మేజిస్ట్రేట్లను వేసేటప్పుడు వాళ్ళ qualifications ను చూచి వేస్తున్నారా ? లేదా ?

The Hon. Sri N. SANJEEVA REDDI :- ఏదో వయస్సులు యోగ్యత, చూస్తారే గాని particular గా దీనికేమీ డిగ్రీ లుండాలని లేదు.

*Subbarao Committee report on Land Reforms*

555—

*1071 Q – Sri T. LAKSHMINARAYANA REDDI :— Will the Hon. the Minister for Revenue be pleased to state

whether the Government propose to place on the Table of the House the Subba Rao Committee report on Land Reforms ?

The Hon Sri K CHANDRAMOULI — Yes, a copy of the report will be placed on the Table of the House, as soon as it is ready for release for information of the public

Sri T. LAKSHMINARAYANA REDDI — Are there any reasons for not submitting it immediately?

The Hon. Sri K. CHANDRAMOULI — అది ఇంకా examination లో ఉంది. తర్వాత print కావాలి. అవన్నీ అయిన తరువాత public కు release చేసిన తర్వాత ఇక్కడ కూడా ఇస్తాము అని చెప్పుతున్నాను.

Sri A KALESWARA RAO — హైదరాబాదులో ఈ Land reform చాలా అభివృద్ధి కరంగా చేశారు. ఆ రిపోర్టులు వాళ్ళ శాసనాలు అవన్నీ కూడా మనము అవలంభించవలసి యుంటుంది గనుక అవన్నీ కూడా తెప్పించి ఇది అది అన్నీ కూడా చదివేట్టుగా ఒక చిన్న Sub-committee ని వేస్తే బాగుంటుంది? దీనివల్ల ఆలస్యం మాత్రం కాకుండా ఈ లోపల అగ్రిమెన్సు ఒకటి తెచ్చి ఉన్న రైతులను వెళ్ళగొట్టకుండా ఒక విధంగా చేస్తే బాగుంటుంది. రంగారెడ్డిగారు హైదరాబాదు నుంచి ఆ రిపోర్టు పంపించారు. ఆ విధంగా మనము కూడా చేయడానికి మంత్రిగారు ఆలోచిస్తారా?

The Hon Sri K. CHANDRAMOULI — ఈ రిపోర్టుతో బాటు అన్ని రాష్ట్రాల ప్రభుత్వరిపోర్టులను కూడా తెప్పించిచూడడానికి ప్రభుత్వం ఆలోచిస్తూనే ఉన్నది. అన్నిటినీచూచి ఈ రాష్ట్రానికి అనుగుణ్యంగా ఉండే పరిస్థితులను బట్టి దానిని సమన్వయంచేసి ఒక రూపంగా తేవలయున నేది ప్రభుత్వంయొక్క ఉద్దేశ్యం.

Sri A. KALESWARA RAO — మీరు అవన్నీ తీసుకొంటే మనకేమి లాభం! మనం విశాలాంధ్రలో చేరబోతున్నాం. కాబట్టి హైదరాబాదు రిపోర్టు తీసుకోవాలి లేకపోతే రెంటిని కలిపి సమన్వయం చేసుకోవాలి కాని, అన్ని రాష్ట్రాల మాట మనకెందుకు అని వారికి మనవి చేస్తున్నాను.

The Hon Sri K CHANDRAMOULI — ఆ విషయం అందరము కలిసిన తరువాత మాట్లాడుకొంటే బాగుంటుందిగానీ ఇక్కడ మాట్లాడటం అంత మంచిదికాదు.

Sri P. NARASIMHAPPA RAO — అధ్యక్షా? అన్ని రాష్ట్రాలరిపోర్టులు చూడడానికి time తీసుకొంటుంది గనుక ముందు భూములనుండి రైతులను వెళ్ళగొట్టకుండా ఒకఅగ్రిమెన్సు అయినా త్వరగా ప్యాసుచేసేఉద్దేశ్యం ప్రభుత్వానికి ఉందా?

The Hon Sri K. CHANDRAMOULI — రిపోర్టు అంతా పరిశీలించిన తర్వాత ఈ విషయాలన్నీ ఆలోచించ బడును.

Sri PILLALAMARRI VENKATESWARLU — October 30 తారీఖుకల్లా రిపోర్టువచ్చినట్లు తెలుస్తున్నది. దాదాపు ౕ నెలలుదాటింది. ఇంకా Cabinet ఆలోచనలోనే ఉన్నదా? ఎందుకు ఇంత ఆలస్యం జరిగింది? వెంటనే Publish చేయడానికి, సభ్యులకు అందచేయడానికి కూడా ఆలోచిస్తారా?

The Hon Sri K. CHANDRAMOULI:— వెంటనే అంటే ఒక రిపోర్టు వస్తే దాన్ని ఏమీ విచారించకుండా, పరిస్థితులు ఆలోచించకుండా చేయటం ప్రభుత్వంయొక్క విధానం కాదు.

Sri PILLALMARRI VENKATESWARLU:—రిపోర్టును విచారించకుండా పరిస్థితులను ఆలోచించకుండా ఏమీ చెయ్యకుండా నిద్రపోతూ మాకివ్వమని మాత్రం కోరటంలేదు. 5 నెలలు అయింది. ఆలోచించలేదు అంటే మా కష్టం అవుతుంది. మీరు ఆలోచించేవేదో సభ్యులముందు పడవేస్తే సభ్యులు కూడా ఆలోచిస్తారు. అర్థం చేసుకోవడానికి వీలుంటుందని నేను అనుకుంటున్నాను. ఈ Budget session అయిపొయ్యే లోపు మాకేమన్నా రిపోర్టు అందచేయటానికి ప్రయత్నిస్తారా ?

The Hon. Sri K CHANDRAMOULI — ఆలోచన లేకుండా చేయడానికి వీల్లేదని మరిమరి నేను చెప్పుతున్నాను. రిపోర్టువచ్చినప్పుడు సభ్యులు ఎదుట పెట్టుతాము.

Sri P GUNNAYYA :— అధ్యక్షా ! Subba Rao Committee Report తెలుగులోనే print చేసి సభ్యులకు ప్రజలకు అందచేయ డానికి ఏర్పాట చేస్తున్నారా ప్రభుత్వంవారు ?

The Hon. Sri K CHANDRAMOULI — ఆ విషయం ఆలోచిస్తాము

Sri VIJAYA BHASKRA REDDI:— అధ్యక్షా ? విశాలాంధ్ర రావటం అందరూ సంతోషించాల్సిన విషయమే. కానీ ఈ భూసంస్కరణలు పెట్టే విషయములో అక్కడ పరిస్థితులకు మనకూ చాలా తేడా ఉంది కనక మన పరిస్థితులను బట్టి మన ప్రభుత్వం భూసంస్కరణలను తెస్తుందను కుంటాను. ఈ విషయంలో ప్రభు-్వ విధానమేమో సెలవిస్తారా ?

The Hon Sri K CHANDRAMOULI -నేను పదేపదే దీన్ని గురిం- చెప్పానండీ. సాధ్యమైనంత త్వరలో ఆ రిపోర్టును తీసుకొని రావటానికి మేముకూడా ప్రయత్నం చేస్తాం.

Sri S VEMAYYA:— ఇప్పటి రిపోర్టు అందచేసి 5 మాసాలయింది. మరి ఎంతకాలంలో పరిశీలనచేసి అమలు చేస్తారో చెప్పగలరా ?

The Hon Sri K. CHANDRAMOULI:— సాధ్యమైనంత త్వరలో.

Sri N. K LINGAM —అధ్యక్షా ? హైదరాబాదు తెలుగువారూ మనమూ ఇద్దరము ఒకటే అని చెప్పి తెలుగు ప్రాంతం అంతా కలిసిపోతున్నాం. ప్రస్తుతానికి ఇది వాయిదావేయకుండా హైదరాబాదులో చేసినటువంటి సిద్ధాంతాలనే వెంటనే ఇక్కడ అమలు పెట్టడానికి ఏమైనా ప్రయత్నం చేస్తుందా ?

The Hon Sri K CHANDRAMOULI:— వాయిదా వెయ్యాలి అనే టటువంటి ఆలోచన ప్రభుత్వానికి లేదు.

Sri P. SREERAMULU.—కాశేశ్వరరావు పంతులుగారు ఒక ప్రక్కన ఇది ఆలస్యం చేయకుండా త్వరగా పరిష్కారం చేయమని చెప్పుతూ హైదరాబాదు రిపోర్టు తెప్పించి అవన్నీకూడా మనం సమగ్రంగా పరిశీలనచేస్తే బాగుంటుందేమో అని సలహా యిచ్చారు. కాని ఇది వారు చెప్పినట్లుగానే ఆలస్యంకాకుండా ఇప్పుడు మనకు వచ్చినటువంటి రిపోర్టుమీద చర్చ జరిపి దీనిని మెరిట్సుమీద మనం discuss చేసి మన

కున్నటువంటి పరిస్థితుల దృష్ట్యా మనం పరిష్కారం చేస్తే బాగుంటుందేమో. అంతవరకు wait చేయకుండా ఆలోచిస్తారా ప్రభుత్వం ?

The Hon. Sri K. CHANDRAMOULI — ప్రభుత్వంయొక్క ఉద్దేశ్యము కూడా నేను మరిమరీ చెప్పానండి. ఇతర పరిస్థితులు ఎట్లా ఉన్నా ఇక్కడ సాధ్యమైనంత త్వరలోనే ఒక బిల్లురూపంలో దీనిని తీసుకురావలెనని ఆలోచిస్తున్నాం.

Sri M. NAGI REDDI.— మంత్రిగారు చెప్పినదానిని బట్టి రిపోర్టును పరిశీలించడానికి ఇంకా కొన్నాళ్లు పట్టవచ్చు. అప్పారావుగారు కౌలుదార్లను వెళ్ళగొట్టకుండా చేస్తారా అని ప్రశ్నిస్తే అదికూడా ఆలోచిస్తామంటున్నారు. కాబట్టి ఇప్పటికప్పుడే ఈ బిల్లు వస్తుందని, ఏదో భూసంస్కరణలు వస్తాయని, భూస్వాములు వెళ్ళగొట్టటం అనేది జరుగుతున్నది. అది ముఖ్యంగా గుంటూరు జిల్లా, కృష్ణా జిల్లాలలో బాగా జరుగుతూవుంది. అందుకని వెంటనే అది పరిశీలించటానికి ఆలశ్యం అయినప్పటికీ కౌలుదార్లను వెళ్ళగొట్టకుండా ఒక ఆర్డినెన్సును తీసుకురావటానికి ప్రభుత్వానికి ఉన్న ఆక్షేపణ ఏమి?

The Hon. Sri K CHANDRAMOULI — ఆర్డినెన్సు తేవటానికి పరిస్థితులు చూడాలి. చూడకుండా యేమీ తేవటానికి వీల్లేదు. అవసరం అయితే అది తేవటానికి ప్రభుత్వం ఎప్పుడూ వెనుకంజవేయదు.

Sri PRAGADA KOTAIAH.— అధ్యక్షా? విశాల ఆంధ్ర ఏర్పడక పూర్వమే భూసంస్కరణల చట్టం ప్రవేశపెట్టడానికి ఈ ప్రభుత్వం పూనుకొంటుందా?

Mr SPEAKER.— ఇంకా ఆలోచిస్తున్నారని చెప్పారు.

*Death of employees at Machkund Project*

556 —

* 919 Q — Sri S. VEMAYYA :— Will the Hon the Minister for Electricity and Social Welfare be pleased to state :

(a) whether the Government are aware of the fact that 7 employees died on 10-10-1955 at Machkund project, and

(b) if so, whether any relief was given to the dependants of the deceased by the Government now ?

The Hon Sri G. LATCHANNA :—

(a) Yes, the accident took place on 11-10-1955 and not on 10-10-1955.

(b) No. The matter is under correspondence with the Government of Orissa

(a) అవునండి. 11-10-55 తేదీన ఈ యొక్క సంఘటన జరిగింది. (b) ఈవిషయమై ఒరిస్సా ప్రభుత్వంతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుగుతున్నాయి.

Sri S. VEMAYYA:— ఇప్పటికే చాలా దీర్ఘకాలం అయింది. ఈ చనిపోయినటువంటి వారిమీద ఆధారపడినటువంటి వారికి తాత్కాలింగానైనా relief ప్రభుత్వం ఇచ్చిందా?

The Hon Sri G. LATCHANNA:— ఈ సంఘటన జరిగిన ప్రాంతం ఒరిస్సా రాష్ట్రం సరిహద్దులలోది. అది మన ఆంధ్ర ప్రభుత్వ సరిహద్దులలోది కాదు. అందువల్ల ఒరిస్సా ప్రభుత్వంయొక్క అభిప్రాయం తెలుసుకోనకుండా మనము ఏచర్యను తీసుకొనడానికి అవకాశం లేదు. అందులో 7 గురు చనిపోయినారు. వారిలో నలుగురు Department employees ముగ్గురు Contractors' employees. Workmen's Compensation Act క్రింద ఈ సంఘటన నిర్ధారించినప్పుడు 4 గురికి Government వారు compensation ఇవ్వాలి. 3 గ్గురికి Contractors ఇవ్వాలి. Government ఏ విధంగా ఇవ్వాలనేది Chief Engineer పరిశీలన పూర్తి అయింది. అయితే అది ఒరిస్సా ప్రభుత్వంయొక్క ప్రాంతం కాబట్టి అక్కడ కలెక్టరుగారి రిపోర్టు Compensation Act క్రింద రాదు అనే అభిప్రాయం తెలియజేస్తూ ఒరిస్సా Government కు ఒక రిపోర్టును ఆయన పంపించి యున్నారు. ఈ విషయం గురించి వారితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుగుతున్నాయి. మేము 28-1-56 తేదిన reminder కూడ పంపించి ఉన్నాము. త్వరలోనే జవాబు రావచ్చును. దానికి ఎదురు చూస్తున్నాం. కనుక వీలైనంత త్వరగా compensation చెల్లించడం జరుగుతుంది.

Sri S RANGANATHA MUDALIAR·— May we know, Sir the circumstances under which the death took place

The Hon Sri G LATCHANNA·— అక్కడ విపరీతమైన వానలు వచ్చినందువల్ల Power House సమీపంలో ఒక రెండు షెడ్డులున్నాయి. ఆ Shed ల పైగా ఒక కొండ ప్రాంతము విరిగి ఈ Shed ల మీద పడి Shed లు ధ్వంసమైనందువల్ల అందులో ఉన్న workers 7 గురు చనిపోవడం జరిగింది.

Sri M. NAGI REDDI — వీళ్ళకు compensation యివ్వడానికి వీలులేదని ఒరిస్సా ప్రభుత్వం అన్నారని మంత్రిగారు చెప్పారు Collector గారికి వ్రాశారని చెప్పారు. అది ఏ కారణాలవల్ల వ్రాశారు? రెండోది, Contractors కు బాధ్యత లేదని చెబుతున్నారు. Contractors అయినప్పటికీ అక్కడ పనిచేస్తున్నారు కాబట్టి ప్రభుత్వం యివ్వడానికి వీలులేకపోయినా ప్రభుత్వము ఏ విధంగా యిస్తుందో Contractor చేత ఆ విధంగా యిప్పించడానికి ప్రభుత్వం కృషిచేస్తుందా?

The Hon Sri G LATCHANNA ·— Contractor coolies కు Contractors యివ్వడం, ప్రభుత్వ coolies కు ప్రభుత్వంయివ్వడం Compensation Act యొక్క విధానంఅని గౌరవసభ్యులకు తెలిసిఉండాలి. అసలు Collector పంపించిన report ఒరిస్సా ప్రభుత్వానికి ఆయన ఏమి కారణాలు చెప్పారో మన ప్రభుత్వానికి తెలుస్తుందనుకోడానికి అవకాశంలేదు. ఒరిస్సా ప్రభుత్వంతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుగుతున్నాయి. ఈ సందర్భంలో చర్చించకుండా వుంటేనే ఎక్కువ ఉపయోగంగా వుంటుందనే నా అభిప్రాయం.

Sri S VEMAYYA —ఈ project రెండు రాష్ట్రాలమధ్య జరుగుతున్నటు వంటిదయినప్పుడు యొక ఒరిస్సా రాష్ట్రం మీదనే యీ బాధ్యత వున్నది, మనకు సంబంధం లేదని చెప్పడం లోని విధానం ఏమిటి ?

The Hon Sri G LATCHANNA:-ఆ ప్రాంతము ఒరిస్సా రాష్ట్ర ప్రభుత్వములో వున్నది. అక్కడ police వ్యవహారం, control, administration ఒరిస్సా ప్రభుత్వానిదిగానీ, మనదికాదు.

The Hon Sri N SANJEEVA REDDI:— It is a simple thing It is their territory అక్కడవాళ్ళచట్టంఅన్వయిస్తుంది కాని మనచట్టం అన్వయించదు because it is their territory. మనచట్టం ఏదివున్నా territory ఒరిస్సా ప్రభుత్వానిది. Project joint ది కావచ్చు.

Sri S. VEMAYYA .— ఈ Government employees గా వుండి చనిపోయినటువంటివారి కేసయినా తాత్కాలికంగా relief యివ్వడానికి ప్రభుత్వం పూనుకుంటుందా ?

The Hon Sri G. LATCHANNA :— ఇప్పుడు ఉప ముఖ్యమంత్రిగారు చెప్పినతరువాత సందేహము కలిగిందంటే ఆశ్చర్యంగా వున్నది. వారి చట్టాలకు లోబడి మనం వ్యవహారం చేయాలి. అందుచేత Collector report ఒరిస్సా ప్రభుత్వం పరిశీలన చేస్తున్నది. మనంతట మనంగా చేసే అధికారం అక్కడ మనకు లేదు.

Sri V VISWESWARA RAO — అధ్యక్షా, ఈ agreement క్రింద Machkhund Project కట్టేది మనం. Workers మనవాళ్ళు. ఆ ప్రాంతం ఒరిస్సా ప్రాంతం అయినప్పటికీ కూడా agreement ప్రకారం అన్నీ మన ఆధీనంలో వున్నప్పుడు అక్కడ చనిపోయిన workers మన Company వాళ్ళయినప్పటికీ ఎందుకు యివ్వకూడదు ? ఒరిస్సా ప్రమేయం తరువాత చూసుకోవచ్చుకదా ?

The Hon Sri G. LATCHANNA :— అది మన కంపెనీ అని చెప్పడానికి అవకాశం లేదు అక్కడ Construction నడిపించడానికి మన Department యొక్క ఆధ్వర్యాన Construction జరగడానికి agreement గాని అక్కడ పరిపాలనా వ్యవహారాలన్నీ కూడా అక్కడ జరుగుతాయి. ఇటీవల ఒక worker అక్కడ Engineerమీద వేసిన complaint ఒకటి వున్నది. ఒక worker ను engineer గారు కొట్టారన్న రిపోర్టుమీద ఒరిస్సాపోలీసు మన Engineer ను విచారణ చేసి ఉన్నారు. అక్కడున్న పరిపాలనవ్యవహారం, control అంతా ఒరిస్సాప్రభుత్వానిది. ఒరిస్సా territory లో జరిగాయి. Employees అందరూ కూడా మనవారు కారు. మనవాళ్ళు 70% వుంటే వారు 30% చొప్పున ఉంటారు.

Sri P GUNNAYYA.—అధ్యక్షా, ఈ Machkhund electricity మన ఆంధ్రదేశానికి supply చేస్తున్నారు. తెలంగాణా యిప్పుడు వచ్చింది కాబట్టి తెలంగాణాకుకూడా electricity supply చేస్తారా ?

Mr. SPEAKER — ఇది electricity supply గురించిన ప్రశ్న కాదు. అక్కడ చనిపోయినవారి కుటుంబాలకు compensation ఇచ్చే విషయం.

Sri PRAGADA KOTAIAH .— ఇక్కడ Collector కు refer చేశామంటున్నారు. అలాగె Labour Commission కు refer చేయలేదా ? చేస్తే వారేమి చెప్పారు ?

The Hon Sri G. LATCHANNA :— అక్కడ Collector కు మనం refer చేయడం కాదు. అక్కడ Collector ఒక report పంపించారు ఒరిస్సా ప్రభుత్వానికి. అక్కడ ఒరిస్సా ప్రభుత్వం దానిమీద విచారణ చేస్తున్నది. మనం ఒరిస్సా ప్రభుత్వాన్ని address చేశాము కాని Collector ను కాదు.

*Payment of Cesses to the Panchayat Boards in Darsi and other Taluks.*

557 —

* 397 Q.— Sri G. YELLAMANDA REDDI — Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state

(a) Whether it is a fact that the amount of Cesses were not paid to the Panchayat Boards in Darsi, Podili, Venktagiri and Sullurpet Taluks, Nellore District,

(b) If so, whether the Government order the payments, to be made, and

(c) If not why ?

The Hon Sri A B NAGESWARA RAO:—

(a) Cesses were paid to the panchayats in Darsi, Podili Venkatagiri and Sullurpet Taluks in Nellore District upto fasli 1360 The Cesses for subsequent fasalis have not been paid on account of the bad seasonal conditions prevailing in the taluks during faslies 1361 to 1364

(b) Steps are being taken to sanction the payment of Cesses due from fasli 1361 taking into consideration the collection so far made towards Cesses since fasli 1361.

(c) Does not arise.

Sri M NAGI REDDI — ఈ Cessల విషయంలో మంత్రిగారి దృష్టికి ఒకప్రశ్న తీసుకురావాలి. పంచాయితీ Board కు వచ్చేవి నూరో, 120యో రూపాయలైనప్పటికీ ఎంతో దూరంనుంచి Sub Treasury కి రావడం మామూళ్ళు యివ్వడం వల్ల ఎంతో ఖర్చవుతుంది. ఒక రూపాయితో Money Order పంపవచ్చు. అట్లా పంపడానికి ప్రభుత్వం ఏర్పాటు చేస్తుందా ?

The Hon. Sri A. B. NAGESWARA RAO :— గౌరవ సభ్యులు యిప్పుడు సూచన చేశారు కాబట్టి అలా చేయడానికి ప్రయత్నం చేస్తాం.

Sri S. VEMAYYA:—ఇప్పటికి 5 ఫసలీల బకాయి వున్నట్టుగా తెలు

స్తున్నది. ఇది తొందరగా యివ్వడానికి ఏదయినా పథకం వున్నదా ? ఇంత ఆలశ్యం కావడానికి కారణాలేమి ?

The Hon. Sri A. B NAGESWARA RAO:— కారణాలు మనవి చేశాను. 1361 నుంచి యిప్పటివరకుకూడా కరువు కాటకాలు వచ్చాయి. 1362వ ఫసలీలో యిచ్చే స్థితిలోలేరు. తరువాత 1363 నుంచి యిప్పటివరకు కూడా కొద్ది కొద్దిగా వసూలు చేస్తున్నారు. Collector గారు, వసూలయిన cess లు పంచాయితీలకు ఎప్పటికప్పుడు జమకడుతున్నారు.

*Establishment of Panchayat Boards in Parupalli and other Villages*

558—

*807 Q —Sri B. SANKARAYYA·—Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to State :

The action taken by the Government for establishing Panchayat Boards in Parupalli, North Mopuru, Bodduvaripalem in Nellore District, all having more than 1000 population?

The Hon Sri A B. NAGESWARA RAO —

Notifications have been issued for the constitution of Panchayats for the villages of Parlapalli, North Mopuru and Bodduvaripalem. Elections to these Panchayats will be held shortly.

*Ayacut under the Krishna Western Division.*

559—

*535 Q —Sri B. V. SIVAIAH·—Will the Hon the Deputy Chief Minister be pleased to state

(a) Whether there are any possibilities of increasing the ayacut under the Krishna Western Division with the construction of Krishna Barrage ;

(b) If so, what are the proposals to increase the ayacut, and

(c) Whether there are any proposals with the Government to supply water for long term crop under Krishna Western High Level Channel ?

The Hon. Sri N. SANJEEVA REDDI:—

(a) The Answer is in the affirmative.

(b) An extent of 71,638 acres can be brought under irrigation in the Krishna Western Division after the completion of the Krishna Barrage under the following schemes.-

| | | Acres. |
|---|---|---|
| Under Guntur Channel | | 24,000 |
| Under Delta Canals | | 20,354 |
| Other cultivation | | 27,284 |
| | Total | 71,638 |

(c) There are no such proposals.

Sri B V. SIVAIAH :— అధ్యక్షా, 1952వ సంవత్సరంలోనే పెదనందిపాడు High level channel Krishna Western Delta లో Investigation కూడా చేయబడి వున్నది. ఇంతవరకు దానిని అమలుజరిపి వుండలేదు. ఇప్పుడు గుంటూరు channel క్రింద 24 వేల ఎకరాలు సాగుబడిలోకి తీసుకురావడానికి పథకం వున్నదని చెప్పారు. అది యీ పెదనందిపాడు channel scheme కు వర్తించే ayacut లోనే యీ గుంటూరు channel వుంటుందా ? మరి ఎక్కడుంటుందో చెబుతారా ?

The Hon Sri N SANJEEVA REDDI — వేరే ప్రశ్న వేయండి.

Sri P. SREERAMULU .— Krishna barrage తయారైనతరువాత ఇప్పుడు యింతవరకు short term crops కు November ఒకటో తారీఖువరకే నీరు supply చేసే ఒక నిబంధన వున్నది. Barrage తయారైనతరువాత ఆ నిబంధనను సడలించి long-term crops కూడా grow చేసుకోడానికి రైతులకు permission యిస్తారా ?

The Hon. Sri N. SANJEEVA REDDI :— Barrage కట్టడంవల్ల కొన్ని ఎకరాలు ఎక్కువ సాగవవచ్చు గాని, క్రిష్ణానదిలో నీరు ఎండకాలంలో వుండదని శ్రీరాములుగారికి తెలుసును. ఆ position improve కాదు barrage కట్టడంవల్ల. కాబట్టి యీ long term crops కు వీలవుతుందో లేదో తుంగభద్ర నీరున్నంతవరకు యిస్తే యివ్వవచ్చు temporary గా. కాని అది మంచిదికాదేమోనని ఆలోచిస్తున్నాం.

Sri PRAGADA KOTAIAH .— గుంటూరు జిల్లాలోని బాపట్ల తాలూకాలో ఎంత ఆయకట్టు పెరుగుతుంది ? దాంట్లో చీరాల తాలూకా కూడా include అయినదా ?

The Hon. Sri N. SANJEEVA REDDI :— నేను యిప్పుడు చెప్పినన్ని వేల ఎకరాలకు తప్ప ఎక్కడెక్కడ నీళ్ళు వస్తాయో వివరాలు చెప్పలేను. 70 వేల ఎకరాలకు మాత్రం వస్తాయి.

Sri B. V. SIVAIAH·—ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో medium size irrigation Scheme finalise చేసినట్టు యింకా చెప్పి వుండలేదు. Guntur channel scheme ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో చేర్చబడే medium size irrigation Scheme చేరుస్తారా ?

The Hon Sri N. SANJEEVA REDDI:— Krishna Barrage కట్టినప్పుడు నీళ్ళు ఎక్కువ వస్తాయంటే అందుకు కావలసిన చర్యలు పుచ్చుకొని తప్ప

కుండా చేరిస్తేకాని వీలులేకుంటే తీసుకోవలసి వస్తుంది. ఏమయినా సరే నీళ్ళు మాత్రం ఉపయోగిస్తాం అని చెప్పగలను.

Sri V VISWESWARA RAO:— అధ్యక్షా, Long term crop కు Supply చేయడం సాధ్యంకాదని మంత్రిగారు చెబుతున్నారు. కాని Short term crop కు August first తారీఖునుంచి గాని 15 వ తారీఖునుంచి గాని నీరు తీసుకోవాలి. మొట్టమొదటిలోనే నీరు తీసుకోడానికి వీలులేదని నిబంధన వున్నది. Barrage కట్టిన తరువాత level పెరుగుతుందని మంత్రిగారు ఒప్పుకున్నారు. కాబట్టి June నుంచి యివ్వడానికి పూనుకుంటారా ?

The Hon Sri N. SANJEEVA REDDI:— Study చేస్తాం కొంత కాలం ఎంతవరకు సాధ్యమవుతుందో, ఎంతనీరు ఎక్కువవుతుందో, study చేసిన తరువాత, రైతు అనుకూలాన్నిబట్టి వీలుంటే మార్చుకోవచ్చు.

*Representations from the villagers of Kandukoor regarding the rehabilitation of the village.*

560—

*814 Q1- Sri T. G. THIMMAIAH SETTY :— Will the Hon. the Deputy Chief Minister be pleased to state

(a) whether any representation has been received from the villagers of Kandukur in Adoni Taluk regarding the rehabilitation of the village, and

(b) if so, the action taken thereon ?

The Hon Sri N. SANJEEVA REDDI .—

(a) Yes.

(b) The remarks of the Special Chief Engineer (Irrigation have been called for and they are awaited.

సప్లిమెంటరీ ప్రశ్నలు రాకుండా ఇంకా కొంచెము information ఇస్తున్నాను. ఇప్పుడు తుంగభద్రపైన మరొక ఆనకట్ట కడుతున్నారు. అది కట్టేటప్పుడు దానిక్రింద ఫలాని గ్రామాలు మునిగిపోతాయి, ఇండ్లు మునిగిపోతాయి, భూములు మునిగిపోతాయి కాబట్టి వాటిని ప్రభుత్వం aquire చేయవలసిన అవసరము ఉంటుందనుకొన్నారు. మన చీఫ్ ఇంజనీయరు, హైదరాబాదు చీఫ్ ఇంజనీయరు అక్కడకు పోయి ఆస్థలము లను పరిశీలన చేసినమీదట ఆ గ్రామాలకు acquire చేయవలసిన అవసరములేదు, ఆ భూములకు acquire చేయవలసిన అవసరములేదు, Flood Banks ఇంకొంచెము ఎత్తు చేస్తే సరిపోతుంది, ఖర్చుకూడా తక్కువ అవుతుంది అని ఒక నిశ్చయానికి వచ్చినారు. రైతులు మాత్రము ఇప్పుడు మీరు banks కట్టినా అప్పుడప్పుడు మేము ప్రమాదములకు గురికావలసి వస్తుంది, కాబట్టి మమ్ములను ఇంకొక ప్రాంతానికి పోయేటట్లుచేసి ఆ భూములు మీరు తీసుకోండి అని నావద్దకు representation వచ్చినారు. దీనిలో ఎంతవరకు నిజముఉన్నదో తప్పకుండా ఆ భూములను తీసుకోవలసిన అవసరము ఉన్నదో పరిశీలన చేయవలసినదిగా చీఫ్ ఇంజనీయరుకు పంపినాను. దానికి ఇంకా సమాధానము రాలేదు.

*Assignment of lands in North Rajupalem village to the Sivai Jamadars*

561—

*892 Q – Sri S. VEMAYYA :— Will the Hon the Minister for Revenue be pleased to state

whether the Government propose to assign S No 41 of North Rajupalem village, Kovur taluk in Nellore district temporarily to the Sivai Jamadars now ?

The Hon Sri K. CHANDRAMOULI :— The answer is in the negative.

Sri S VEMAYYA —అధ్యక్షా, ఈ సర్వే నెంబరు classification ఏమిటి? ఎందువల్ల దీనిని ఇవ్వడానికి సాధ్యపడదు ?

The Hon Sri K CHANDRAMOULI:—Temporary గా ఇప్పుడు assign చేయడానికి వీలుపడదు అయినప్పటికి దీని విషయములో కలెక్టర్లను, తహశీల్దారులకు, వీటిని Village Poramboke గా convert చేసి permenent గా వాళ్ళకు House sites గా ఇవ్వడానికి అవకాశము ఉండేటట్లుగా చూడమని instructions ఇచ్చినాము. ఆ report వచ్చిన తరువాత ఇండ్లు కట్టుకోడానికి అవకాశం చూపించడం మంచిది అనుకొంటాను.

*Deputing persons abroad for training in improved methods of milk supply scheme.*

562—

*917 Q —Sri S. VEMAYYA —Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state :

Whether there are proposals with Government to depute persons abroad to get training in dairying on co-operative basis and improved method of milk supply scheme now ?

The Hon Sri D SANJIVAYYA:—No, Sir

Sri S. VEMAYYA·— అధ్యక్షా, administration reports అన్నీ కూడా ఇతర దేశాలకు పంపమని ప్రభుత్వానికి సూచించ బడదా ? సూచిస్తే ఆ సూచనలు ఏమిటో శెలవిస్తారా ?

The Hon Sri D. SANJIVAYYA·— Co-operative Department లో అటువంటి వేమీ సూచించ బడలేదు. కాని Animal Husbandry Department లో కొన్ని సూచనలు ఉన్నాయి. కొంతమంది పేర్లుకూడా పంపబడ్డాయి.

Sri S. VEMAYYA:— అధ్యక్షా, ఆ పేర్లు ఏమిటో శెలవిస్తారా ?

The Hon Sri D SANJIVAYYA·— Major J. Morari, Director of Animal Husbandary, B A. Shiraji, Deputy Director of Animal

Husbandry, One of the officer whose name has not been specified here.

*Starting of Rehabilitation Centres in the State.*

563 —

* 1014 Q — Sri S VEMAYYA : Will the Hon the Minister for Local Administration and Prohibition be pleased to state

(a) whether there are proposals with Government now to start rehabilitation centres in the State for the Tuberculosis Ex-patients , and

(b) if so, where they will be started in the State now ?

The Hon Sri A B NAGESWERA RAO:—

(a) The answer is in the negative.

(b) Does not arise

Sri S. VEMAYYA .— అధ్యక్షా ! కనీసం ex-patients కాలనీలు అయినా పెట్టమని ప్రభుత్వానికి నివేదికలు వస్తున్నాయా ? వస్తే, అవి పెట్టడానికి ప్రభుత్వమునకు ఏమైనా అభ్యంతరం ఉన్నదా ?

The Hon. Sri A. B. NAGESWARA RAO — ఇటువంటివాటికి ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ఏమీ తావులేదు. ప్రస్తుతం Tuberculosis Sanatorium ఒకటి ప్రభుత్వానిది నెల్లూరులో ఉన్నది. రాజమండ్రిలోను, మదనపల్లి లోను కూడా ప్రయివేటు శానిటోరియములు ఉన్నవి. వీటికి maintenance grants ఇస్తున్నారు అవి చాలకపోతే మైసూరులోను, మద్రాసులోను కూడా మన రోగులకు స్థానం ఉన్నది. Tuberculosis కు బళ్ళారిలో 100 మందికి, తాంబరములో 50 మందికి డబ్బు ఇచ్చికొని ఆంధ్రులకోసము provision చేశాము. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో విశాఖపట్టణములోను, గుంటూరులోను, కర్నూలులోను శానిటోరియములు పెట్టడానికి అవకాశం కలుగచేయబడింది.

Sri S. VEMAYYA :— నెల్లూరులో ఉన్న శానిటోరియంకు ఒక ex-patients కాలనీ పెట్టడానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

The Hon. Sri A B. NAGESWARA RAO :— అటువంటి ఆలోచన ప్రభుత్వానికి లేదు.

*Transfer of a portion of the Cuddapah Balupalli Road to the Highways Department*

564 —

*789 Q. — Sri P. VENKATA SUBBAYYA :—Will the Hon. the Deputy Chief Minister be pleased to state :

(a) whether the Government have now ordered the transfer of a portion of the Cuddapah Balupalli Road viz., from Renigunta to Kodur to the Highways Department , and

(b) if so, the amount sanctioned to improve that portion of the road ?

The Hon. Sri N. SANJEEVA REDDI :—

(a) The answer is in the affirmative.

(b) The Government accepted the proposal of the Chief Engineer (Highways) to effect necessary improvements to the Kodur Renigunta road at a cost of Rs. 6,41,000/-.

Sri P NARASIMHAPPA RAO — అధ్యక్షా, జిల్లాబోర్డుల క్రిందఉన్న రోడ్లు ఇతర డిపార్టుమెంటులక్రింద ఉన్నరోడ్లు అన్ని కలిపి ఒకడిపార్టుమెంటుక్రిందకు తీసుకునే ఉద్దేశ్యము ప్రభుత్వమువారికి ఉన్నదా ? లేదా ? జిల్లాబోర్డుల రోడ్లు చాలా అధ్వాన్నముగా ఉన్నాయి. మరమ్మతులు లేవు. అందువల్ల వీటిని P. W. D. క్రిందకు తీసుకొని మరమ్మత్తులు చేసే ఉద్దేశ్యం ఉన్నదా ? లేక అట్లాగే ఉంచాలనే ఉద్దేశ్యం ఉన్నదా ?

The Hon. Sri N SANJEEVA REDDI .— General policy కు సంబంధించిన ప్రశ్న అడిగారు. అది చాలా పెద్దది. జిల్లాబోర్డుల రోడ్లు, famine రోడ్లు అన్నీ కూడా P. W D. క్రింద తీసుకుంటే ఖర్చు చాలా ఎక్కువ అవుతుంది. జిల్లాబోర్డులక్రింద ఉన్న రోడ్లు ఒక standard క్రింద ఉన్నాయి, Village roads ఒక standard క్రింద ఉన్నాయి. ఈ విధంగా అన్నిరోడ్లు అన్ని రకాల వెడల్పుల లోను, రకరకాల standard తో ఉన్నాయి. అందువల్ల ఖర్చులు చాలా జాస్తిగా ఉంటాయి. అంతడబ్బు ప్రభుత్వానికి లేదు. డబ్బు ఉంటే చేయడానికి ఆక్షేపణలేదు. జిల్లాబోర్డుల పరిస్థితికూడా చాలా అధ్వాన్నముగా ఉన్నది, కాబట్టి వారుకూడా ఏమీ ఖర్చు పెట్టలేకపోతున్నారు. జిల్లాబోర్డుల రోడ్లు, Villages రోడ్లు అన్నీ చాలా అధ్వాన్నంగా ఉన్నాయని ప్రభుత్వానికి తెలుసు. ఇప్పటి పరిస్థితులలో ఏమీ చేయలేకుండా ఉన్నారు. ఏమిచెయడానికి వీలవుతుందో ఆలోచిస్తాను.

Sri P. VENKATASUBBAYYA .— అధ్యక్షా, ఈ జిల్లాబోర్డు రోడ్లకు హైవేస్ డిపార్టుమెంటు రోడ్లకు మంజూరు చేయడానికిగాను, ఈ బడ్జెటులో 11 లక్షల రూపాయిలు కేటాయించ బడ్డవి. అందులో కడప, బారుపల్లి రోడ్ల ఖర్చులు కూడా చేరి ఉన్నాయా ?

The Hon Sri N SANJIVA REDDI.— ఎన్నో లక్షలు ఖర్చుచేయవలసి ఉన్నది. గడచిన సంవత్సరము దాదాపు 40 లక్షలు ఖర్చు పెట్టాము. ఈ సంవత్సరము బడ్జెటులో వున్న పరిస్థితినిబట్టి దానిని 11 లక్షలకు తగ్గించాము. కడప బారుపల్లి రోడ్డుకే 11 లక్షలు సరిపోతుంది. రాష్ట్రం మొత్తంపైన జిల్లాకు ఒక లక్ష రూపాయల చొప్పున వస్తుంది. అందులో కడప జిల్లావంతు లక్షరూపాయిలలో కడప బారుపల్లి రోడ్డుక్రింద ఖర్చు పెడతారో, ఇంకే రోడ్డుకు ఖర్చు పెడతారో సరిగా నిర్ణయము చేయలేదు.

Sri N. P. CHANGALRAYA NAIDU:—అధ్యక్షా జిల్లాబోర్డురోడ్లకు

హైవేస్ రోడ్లకు standard లో తేడా ఉన్నను ఫరవాలేదు. ఈ maintenance చేయుటలో సవతితల్లి ప్రేమ లేకుండా చూస్తారా ?

The Hon. Sri N. SANJEEVA REDDI.— సవతితల్లి ప్రేమ లేకుండా చూడాలనే గడచిన సంవత్సరం 40 లక్షలు ఇచ్చిన State Highways రోడ్లను ఈ సంవత్సరం లగ్గించి దానిని జిల్లాబోర్డులకు ఇస్తున్నాము. ఎప్పటికైనా జిల్లాబోర్డు రోడ్లు బాగు పడుతాయనే ఉద్దేశ్యంతోనే మేము ఉన్నాము.

Sri N C SESHADRI — అధ్యక్షా, తాలూకా కేంద్రములలో జిల్లా కేంద్రాలలో కలుస్తున్న రోడ్ల కన్నింటికి black Toping చేయాలనే ప్రోగ్రాం ఉన్నది? అది చేయడానికి ఎంతకాలము పడుతుంది.

The Hon. Sri N. SANJEEVA REDDI — 20 సంవత్సరములలో పూర్తి కావచ్చును.

Sri P GOPALU REDDI,—అధ్యక్షా, చిత్తూరు జిల్లాలో నగరి, నెరియం వరకు ఉన్న రోడ్డుమీద సుమారు 20 బస్సుల వరకు నడుస్తున్నాయి. ఆ రోడ్డు జిల్లా బోర్డు స్వాధీనంలో ఉన్నది. మరమ్మత్తులు లేకుండా అధ్వాన్నముగా ఉన్నది దానిని హైవేస్ డిపార్టుమెంటు క్రిందకు మార్చుటకు ఎందుకు ప్రయత్నం చేయరు?

The Hon. Sri N SANJEEVA REDDI — రాష్ట్రములో ఉన్న రోడ్లన్నింటికంటె చిత్తూరుజిల్లాలో ఉన్న రోడ్లు బాగా ఉన్నాయని చాలాయేండ్ల నుంచి ప్రతీతి. వాటినే హైవేస్ క్రిందకు తీసుకుంటే అంతకంటె అధ్వాన్నముగా ఉన్నరోడ్లు రాష్ట్రములో ఎన్నో వేల మైళ్ళు ఉన్నాయి. వాటిని ఏమిచేయాలి ?

Sri N. K. LINGAM —అధ్యక్షా, 11 లక్షల రూపాయిలు ఈ రోడ్ల క్రింద మంజూరు చేసినట్లు మంత్రిగారు తెలియ జేశారు. అట్లా అయితే ప్రతి జిల్లాకు ఒక లక్ష చొప్పున మంజూరు చేశారా ? అట్లు చేసి ఉంటే నందికొట్కూరు నంద్యాల రోడ్డుకు అందులోనుంచి ఖర్చు పెడతారా ?

The Hon. Sri N. SANJEEVA REDDI.— జిల్లాకు ఒక లక్ష అని భాగించలేదు. అసలు మంజూరుచేసింది 11 లక్షలు ఉన్నాయి గదా ? అందువల్ల ప్రతి జిల్లాకు ఒక లక్ష ఖర్చు పెడదామనే ఉద్దేశ్యంతో నేను జనరలుగా అనుకొన్నాను. నంద్యాల నందికొట్కూరు రోడ్డు చాలా ముఖ్యమైనదని నాకు తెలుసు. మిత్రులు అయ్యపురెడ్డి, శ్రీ లింగం గార్లు చాలా కాలం నుంచీ ఈ రోడ్డు కొరకు బాధపడు తున్నారని నాకు తెలుసు ఈ విషయం ఛీఫ్ ఇంజనీయరు గారితో చెప్పినాను. వారు తప్పకుండా దానిని గురించి ఆలోచిస్తారు.

Mr. SPEAKER:— ఇ కడపజిల్లాకు సంబంధించిన ప్రశ్న. అన్ని జిల్లాల రోడ్లను గురించి ప్రశ్న అడిగితే ఇది general ప్రశ్న అయిపోతుంది.

*Transfer of Senior Co-operative Inspectors*

565—

*1024 Q.—Sri S. VEMAYYA:—Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state :

17th March 1956]

[a] The authority who transfers Senior Co-operativ- Inspectors

[i] Before the formation of the Andhra State ; and

[ii] After the formation of the Andhra State ;

[b] Whether there are proposals with the Government to stop State-wide transfers of Senior Co-operative Inspectors in the State ?

The Hon. Sri D SANJIVAYYA —[a] [i] and [ii] The Deputy Registrar of Co-operative Societies working as Personal Assistant to the Registrar of Co-operative Societies is the competent authority to transfer Senior Inspectors of Co-operative Societies, before and after the formation of the Andhra State.

(b) No, Sir.

Sri S VEMAYYA — State-wide transfers లేకుండా చేయుటకు ఆలోచిస్తామని ముఖ్యమంత్రిగారు చెప్పినారు. ఆ విషయాన్ని పురస్కరించుకొని Co-operative Inspectors కు State-wide గా వున్న transfers చేయడాన్ని ఆపుచేస్తూ ప్రభుత్వంవారు ఉత్తరువులు జారీచేస్తారా ?

The Hon Sri D SANJIVAYYA.— ముఖ్యమంత్రిగారు హామీ ఇచ్చి ఉన్నట్లయితే దానిని గురించి పరిశీలించి త్వరలో ఒక నిర్ణయం చేస్తాము.

Sri P. VENKATA SUBBAYYA :— Co-operative Junior Inspectors యొక్క transfers విషయంలో 3 జిల్లాలుగా పెట్టి transfers చేస్తున్నారు. అదే మాదిరిగా Co-operative Senior Inspector ను కూడా 2, 3 regions గా పెట్టి ఆ region లోనే transfers చేస్తే బాగుంటుంది. ఆ సలహాను మన్నిస్తారా ?

The Hon. Sri D. SANJIVAYYA :— ఈ విషయంలో ముఖ్య మంత్రిగారు హామీ యిచ్చారని అంటున్నారు. దానిని పరిశీలిస్తాను.

*Loan to Adoni Municipality*

566—

*1059 Q – Sri T. G THIMMAIAH SETTY:— Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state.

the reasons for not sanctioning the loan to Adoni Municipality towards the drainage and Water-supply Schemes ?

The Hon. Sri A. B NAGESWARA RAO :—

Neither of the schemes have been investigated Only schemes which are almost completed or can be substantially completed before 31st March 1956 are eligible for loan from

the Central loan Assistance under the 1st Five Year Plan. The question of sanctioning loans for the schemes of Adoni Municipality will be considered as soon as possible after the Schemes are investigated and designed.

[Note — An asterist * at the commencement of a Speech denotes revision by the Member ]

*II Point of information re — Inclusion of Sri Obula Reddi in the Cabinet*

Sri N. P CHENGALRAYA NAIDU – ఓబులరెడ్డిగారు Treasury Bench లో కూర్చున్నారు. వారు ఎప్పుడు మంత్రిగా అయినారో ముఖ్యమంత్రిగారు కాని, ఉప ముఖ్యమంత్రిగారు గాని మాకు చెప్పలేదు

Mr SPEAKER — Mr Obula Reddi became a Minister on 15-3-'56, in the afternoon at 5-30

Sri PRAGADA KOTAIAH — ఈ సందర్భంలో ఒక ప్రధానమైన విషయాన్ని మీదృష్టికి తీసుకొనివస్తున్నాను. మొన్న 15-3-'56 తేదీ సాయంకాలం 5 గంటలకు ఓబులరెడ్డిగారిచేత గవర్నరుగారు ప్రమాణస్వీకారం చేయించినారు. ఈ సందర్భంలో శాసన సభ్యులయొక్క మర్యాదను పూర్తిగా నిర్లక్ష్యంచేశినారు. Sessions జరుగుతుండగా ఇతర సభ్యులకు తెలియజేయకుండా ఒక సభ్యునిచేత మంత్రిగా ప్రమాణస్వీకారం చేయించడం మనదేశంలో యే రాష్ట్రంలోనూ కూడా జరిగివుండదనుకుంటాను.

Mr. SPEAKER — మీరు ఉపన్యశిస్తున్నారా ?

Sri PRAGADA KOTAIAH — ఒక ప్రధానమైన విషయాన్ని మీ దృష్టికి తీసుకొని వస్తున్నాను. ఈలాంటి సందర్భాలలో Cabinet Secretary, మంత్రులు, గవర్నరుగారు మాత్రమే వుండాలనే సాంప్రదాయం వుందేమో అనుకుంటే చాలామంది కార్యదర్శులను పిలిచారు. Heads of Departments నందరిని ఆహ్వానించారు. Sessions జరుగుతున్నపుడు కూడా శాసన సభ్యులను ఆహ్వానించ లేదు. అందువలన అక్కడకు వెళ్లినట్టి కొంతమంది సభ్యులు వెనక్కు తిరిగి రావలసిన దుస్థితి యేర్పడింది. ఈ శాసనసభ కార్యదర్శిగార్ని కూడా ఆహ్వానించడం జరిగింది సభాధ్యక్షులయిన మిమ్ములను కూడ పిలవలేదని తెలుస్తున్నది. అధ్యక్షులవారిని, శాసన సభ్యులను ఈ విధంగా గవర్నరుగారు తృణీకరించే పరిస్థితి ఏర్పడింది. అన్నగారి వివాహము జరుగుతోంటే బంధువులు, చుట్టు ప్రక్కల గ్రామాలవారు వెళ్ళ వచ్చును కాని తోడ బుట్టిన సోదరులు వెళ్ళి చూచుటకు వీలులేని ధోరణిగా గవర్నరుగారు ఈ వ్యవహారాన్ని ఎందుకు చేశారో తెలియదు. ముఖ్యమంత్రిగారు ఊరిలో లేకపోవుట వలన ఇది ఈ విధంగా జరిగిందేమో అనుకొంటున్నాను. ఆనాడు సభానాయకుడు కనుక ఉన్నట్లయితే దానిని సర్దుబాటుచేసి శాసన సభ్యుల మర్యాదకు భంగం లేకుండా చేయడానికి వీలుండేది. ఒక్క శాసన సభ్యులు మాత్రమే కాక మాజీ

మంత్రిగానైన కూర్మయ్యగారు కూడ అక్కడకు వెళ్ళి తిరిగిరావలసిన పరిస్థితి యేర్పడింది. దీనిని సవరించ వలసిందిగా మీకు తెలియజేస్తున్నాను

Mr SPEAKER — Are you raising a question of privilege ?

Sri PRAGADA KOTAIAH — పరీక్షించ వలసినదిగా నేను కోరుతున్నాను. ఇది privilege క్రిందకు వస్తుందో, లేక శాసనసభ్యుల మర్యాదకు భంగంగా చులకనగా చూడడం క్రిందకు వస్తుందో మీరు సమగ్రంగా విచారణ చేయవలసిందిగా కోరుతున్నాను.

Mr SPEAKER —My view is that uninvited guests will have to put up with disappointment

Sri S VEMAYYA — కొంతమంది స్నేహితులు ఓబులరెడ్డిగారి దగ్గరకు వెళ్ళి "మీరు ఎప్పుడు మంత్రి అవుతారు" అని అడిగితే "నేను మంత్రి నయ్యేదాకా నమ్మకం లేద"ని చెప్పాగట ఇప్పుడయినా వారికి ఆ నమ్మకం కలిగిందేమో తెలవివ్వాలి.

The Hon Sri N. SANJEEVA REDDI — అధ్యక్షా, ఈ విషయాన్ని గురించి కోటయ్యగారు సరిగానే ఊహించారను కొంటాను. ముఖ్యమంత్రిగారు ఊరిలో లేకపోవడంవల్ల సరియైన యేర్పాట్లు జరగలేదేమో అనుకొంటాను. మంత్రులందరికీ కూడా $6\frac{1}{2}$ గంటలకు ఓబులరెడ్డిగారు ప్రమాణ స్వీకారం చేస్తున్నట్లు నోటీసు వచ్చింది. కాని $5\frac{1}{2}$ గం॥లకే నని చెప్పి తెలియగా మంత్రులంపెరూ కూడా తొందరగా పోవలసి వచ్చింది. Leader గారు వున్నట్లయితే సభ్యులందరినీ ఆహ్వానించే యేర్పాట్లు సరిగా జరిగి ఉండును. ఎవరైనా అక్కడకు వచ్చి తిరిగి పోయిన సంగతి గవర్నరుగారికి కూడా తెలిసి వుండదు. సభ్యులను insult చేయాలనే ఉద్దేశ్యం ఉండదు. అలా జరిగినందుకు ప్రభుత్వం తరుఫున నేను విచారాన్ని తెలియ జేస్తున్నాను ఇకముందు మంత్రులను చేర్చడము మొదలైనవి జరుగుతుంటే శాసన సభ్యులకు గాని, మంత్రులకు గాని అమర్యాద జరుగకుండా వుండడానికి గవర్నరు గార్ని, మంత్రిగార్ని కూడా మనం కోరవచ్చును.

Sri VAVILALA GOPALAKRISHNAYYA — S R C Bill వచ్చినట్లు తెలుస్తోంది. అది వచ్చిందా ? దాన్ని గురించి ఎప్పుడు చర్చిస్తారో తెలియ జేస్తారా ?

The Hon Sri N SANJEEVA REDDI — ఈ నాడు పార్లమెంటులో చర్చిస్తున్నారను కొంటాను బిల్లు కాపీలను ఈదినం అక్కడ పోస్టుచేస్తె రేపో, ఎల్లుండో మనకు అందుతాయి.

## III BUDGET FOR THE YEAR 1956-57 (Contd )

### VOTING OF DEMANDS FOR THE YEAR 1956-57 *(Contd )*

DEMAND No XII - Administration of Justice.

DEMAND No XIII - Jails.

DEMAND No XIV - Police

The Hon. Sri N. SANJEEVA REDDI — Mr Speaker, Sir, on the recomundation of the Governor. I move.

1 "That the Government be granted a sum not exceeding Rs 65,83,900/- under Demand No XII - Administration of Justice;"

2 "That the Government be granted a sum not exceeding Rs 24,06,000/- under Demand No XIII - Jails"

3 "That the Government be granted a sum not exceeding Rs 2,71,00,000/- under Demand No XIV - Police."

Administration Justice పద్దకు రు. 65,83 900 లు, Jails పద్దుకు రు. 24,06,000 లు, Police పద్దుకు రు. 2 కోట్ల 71 లక్షలు. ఈ మూడు demands ను కలిపి ప్రవేశపెడుతున్నాను. సభ్యులందరూ ఆమోదించవలసినదిగా కోరుచున్నాను. ఈ సంవత్సరం మన రాష్ట్రంలో జైళ్ళను గురించి ప్రత్యేకంగా చెప్పుకోతగ్గ మార్పులేమీ జరుగలేదు. రాష్ట్రం యేర్పడినతరువాత మనకు కావలసినన్ని jails లేవని సభ్యులందరకూ తెలుసు బళ్ళారిలోని Junior Certified School, Chingleput Certified School, Allipuram Jail మున్నగునవి మనం వాడుకుంటున్నాము. మన రాష్ట్రంలో రాజమండ్రిలో ఒకటి, విశాఖపట్నంలో ఒకటి మొత్తం 2 Central Jails వున్నాయి. నెల్లూరులో ఒక Special Sub-jail వున్నది. ఈ మధ్యనే రాజమండ్రి సెంట్రల్ జైలులో స్త్రీ ఖైదీలకు ప్రత్యేకమైన వసతులు కల్పించబడినవి. బళ్ళారిలోని జైలును మిగిలిన జైళ్ళను వాడకుండా మన రాష్ట్రంలోనే కావలసినన్ని Jails ను కట్టించుకోవాలని ప్రయత్నం చేశాము. బాపట్లలో ఒక Central Jail ను కట్టించుటకు అక్కడి స్థలమును నిర్ణయించడం, మిగిలిన చర్యలు తీసుకోవడం జరుగుతోంది. ఇంతలో విశాలాంధ్ర సమస్య వచ్చినది. S. R C. వారి Report వల్ల బళ్ళారి, హొస్పేట, సిరిగుప్ప తాలూకాలు మనకు వచ్చే అవకాశాలున్నట్లు తెలియడం వలన బళ్ళారి ప్రాంతంలో క్రొత్తగా ఒక Jail ను కట్టవలసిన అవసరం యేర్పడుతుందేమో నని భావించి, బాపట్లలో బళ్ళారి, అనంతపురములలో నూతన పద్ధతులలో కట్టవలచిన agriculture colony క్రింద ఒక Jail ను కట్టించుదామనుకున్నాము. ఈ కార్యక్రమాన్నంతా కూడా ప్రస్తుతం విరమించుకున్నాము. ఇంతవరకు బళ్ళారి విషయం తెలియదు. ఇప్పుడున్న పరిస్థితులనుబట్టి చూస్తే బళ్ళారి, అల్లిపురం జైలులు మన స్వాధీనంలోకి వస్తాయో, రావో అనే సందేహం కల్గుతోంది. ఇప్పుడు హైద్రాబాద్‌లో వున్న jails పరిస్థితి తెలియదు. అందుచేత ప్రస్తుతం ఈ కార్యక్రమాన్ని మానుకుందాము. ఇప్పుడు మన రాష్ట్రంలో వున్నట్టి Jails చాలా ఇరుకుగా వుండడమే కాకుండా మన రాష్ట్ర ఖైదీలు అల్లిపురం జైలులో వెయ్యిమంది బళ్ళారిలోని Borstal School లో 76 మంది Chingleput Senior Certified School లో 132 మంది, బళ్ళారిలోని Junior Cartified School లో 332 మంది వున్నారు. ఈ రకంగా మన రాష్ట్రానికి వెలుపల 1,000 మంది ఖైదీలు, 500 మంది Borstal School లోనూ వుండడం జరుగుతున్నది.

ఇప్పుడు విశాలాంధ్ర దృష్ట్యా జైళ్ళ పరిస్థితిని బట్టి క్రొత్తగా జైళ్ళను కట్టవలెనా లేక హైదరాబాదులోను, ఇక్కడ ఉన్నటువంటి జైళ్ళతో సర్దుబాటు చేసుకోడానికి వీలవుతుందా అనే విషయాలను, విశాలాంధ్ర ఏర్పడిన తరువాత ఏర్పడే ప్రభుత్వము

17th March 1956] (Sri N. Sanjeeva Reddi)

పరిశీలన చేస్తారని అనుకొంటాను అనంతపురం దగ్గర Agricultural Colony కట్టదలచుకొన్నప్పటికీ, ఆ సమస్యను కూడా వారే పరిశీలన చేస్తారు. కాబట్టి ఈ జైళ్ల విషయంలో క్రొత్త పద్ధతులు అనుసరించామని చెప్పడానికి గాని, నూతన పద్ధతులకొరకు ఏర్పాట్లు చేశామని చెప్పడానికిగాని వీలులేదు. మామూలు పరిస్థితిలోనే జైళ్ళ administration ఇంతవరకు జరిగింది. ఖైదీలకు కావలసిన వసతుల విషయంలోగాని, చదువు సంధ్యల విషయంలోగాని, ఆహారము విషయంలోగాని, medical arrangementsలో గాని చెప్పుకోదగ్గ మార్పులు ఈ సంధిగ్ధావస్థలో చెయ్యడానికి ప్రభుత్వానికి వీలులేక పోయింది. విశాలాంధ్ర ఏర్పడితేతప్ప ఈ సంధిగ్ధావస్థనుంచి మనం బైటపడము. అప్పుడు ఈవిషయాలన్నీ జాగ్రత్తగా పరిశీలనచేసి మనకు కావలసిన వసతులు కల్పించుకోవడానికి వీలవుతుంది. అందుచేత ఇప్పుడు జైళ్ళ పరిస్థితిని ఉన్నదున్నట్లే ఉంచినాము. ఈ మొత్తము మామూలుగా ఖర్చుపెట్టేది కాబట్టి దీనిని grant చేయవలసిందిగా కోరుతున్నాము Court ల విషయంలోను Administration of justice ను గురించి కూడా పలుమారులు చర్చిస్తూనే ఉన్నాము. High court లోను law offices లోను Sessions Court వగైరాలన్నిటిలోను కార్యక్రమాలన్నీ సక్రమంగా జరుగుతున్న విషయం మీకు తెలుసు. క్రొత్తగా amendments వస్తున్నాయి. ఆంధ్ర దేశంలోని చాలా జిల్లాలలో అప్పుడే separation of Judiciary అమలు జరిగింది. East Godavari, Krishna, Guntur జిల్లాలలో అమలు పరచాలనే ప్రయత్నం చేసినాము గత సంవత్సరము West Godavari లో separate చేసినాము. ఈ సంవత్సరము తూర్పుగోదావరిలో విడదీయాలని అనుకొన్నాము. కాని separation of judiciary ను గురించి మద్రాసులో examine చేసినపుడు దానివల్ల ప్రభుత్వానికి కొన్ని లక్షలు మిగులుతోందని చెప్పినారు. అందువల్ల దానిని త్వరగా అమలు జరపాలని అనుకొన్నాము. ఈ సంవత్సరము తూర్పుగోదావరిజిల్లా విషయం ఆలోచించినప్పుడు మిగులు కలుగలేదు సరికదా ఒక్కొక్కజిల్లాకు దాదాపు 2 లక్షల రూపాయలు అదనంగా ఖర్చు అవుతున్నట్లు తేలింది. ఈఅదనపుఖర్చు ఎందుకుగాను అవుతున్నదో పునఃపరిశీలనచేసి ప్రభుత్వదృష్టికి తేవలసిందిగా అజ్ఞాపిస్తూ separation ను వాయిదా వేయడం జరిగింది. అయినప్పటికి ప్రభుత్వము యొక్క దృక్పథం మాత్రం మారలేదు. ఆ మూడు జిల్లాలలో Jndiciary ని విడదీయవలసిన ఆవశ్యకతను గుర్తించినాము. ఆ పద్ధతిని సంపూర్ణముగా అమలు జరుపుతాము. అమలు జరపడంలో ఆలస్యం కావచ్చు గాని పద్ధతినిమాత్రం అంగీకరించే ఉన్నాము Court fees మొదలైన విషయాలలో Assembly వారే తగు సవరణలు చేసినారు. Criminal Procedure Code Amendment Act కు సంబంధించిన సవరణలు వగైరాలన్నీ ప్రభుత్వ ఆలోచనలో ఉన్నాయి. దానికి కావలసిన చర్యలు తీసుకుంటూనే Judiciary ఎంత స్వతంత్రంగా ఉండటానికి అవకాశము ఉంటుందో అంత స్వతంత్రంగా ఉంచాలనే ప్రభుత్వంయొక్క ఉద్దేశ్యము. న్యాయాన్ని ప్రజలందరికి సమానంగా అందజేయడానికి వీలుగా ఉండేటట్లు చేయాలనే ప్రభుత్వము యొక్క ఆశయము. ఆ ఆశయాన్ని దృష్టిలో ఉంచుకొని ఏ కార్యక్రమము మొదలుపెట్టినా ప్రభుత్వం కూడా దానిలో పాల్గొంటుంది. ఇప్పుడు ప్రత్యేకంగా విమర్శించదగ్గ కార్యక్రమం ఏమి లేదు. కొన్నిచోట్ల Court లు పెట్టలేదని, కొన్ని తాలూకాలలో దూరముగా ఉన్నాయని, నందిగామ తాలూకాలోను, సత్తెనపల్లి తాలూకాలోను Court లు లేవని, ఇలాంటి వాటికి cut motions అనేకము వచ్చినాయి. కోర్టులను పెట్టడము

పెట్టకపోవడము, ఈ రెండూ కూడా అక్కడున్న పరిస్థితులనుబట్టి, కేసుల సంఖ్యనుబట్టి కోర్టులు పెట్టడంద్వారా కలిగే ఖర్చునుబట్టి పరిశీలన చేస్తూ ఉంటాము.
సాధారణంగా కోర్టులు పెట్టడం పెట్టకపోవడం అనే విషయంలో High Court వారి సూచనల ప్రకారం చేస్తూ ఉంటాము. ఆ తాలూకాలో కోర్టులేదు, ఈ తాలూకాలో కోర్టులేదుఅని ఆందోళన చెయ్యకుండా రాష్ట్రం మొత్తంమీద Administration of Justice ఎట్లా జరుగుతోంది? దానిలో ఇంకేమైనా అకతవకలు ఉంటే వాటిని సరిచేయడానికి మార్గాలు సూచిస్తే బాగుంటుందేమోనని నేను అనుకొంటున్నాను. అటువంటి సూచనలు సభ్యులు చేయగలరని ఈ Demand ను ఏకగ్రీవంగా ఆమోదించ గలరని ఆశిస్తున్నాను. మూడు డిమాండ్లలో పెద్దదైనటువంటి Police Demand ఒకటి ఉన్నది. Police Demand లో ప్రత్యేకంగా నేను సభ్యులకు చెప్పవలసిన నూతన విషయాలేమీ లేవు. రాష్ట్రం ఏర్పడిన 2½ సంవత్సరాలనుంచి పోలీసువారు తమ యొక్క అధికారాన్ని గట్టిగా చెలాయించ వలసిన అగత్యము లేకపోవడమే వారు బాగా పనిచేసినారని చెప్పుకోవడానికి నిదర్శనము Police వారికి ఎక్కువగా ఖర్చుపెట్టడం లేదు. Police Demand ఏమాత్రం కూడా పెంచబడలేదు Fire Stations కూడా పెట్టాలి.

Fire Stations కొద్దిగా ఉండడమే కాక ఉన్న కొద్దిలో కూడా పాత ఇంజన్లు, పనికిరానివి చాలా ఉన్నాయి. మా దగ్గర డబ్బుగనుక ఉంటే ఒక్కసారి వీటన్నిటిని out right గా condemn చేసి క్రొత్తవి కొనడానికి వీలయ్యేది. ఈ విషయంలో 5, 6 లక్షలేకాదు 40, 80 లక్షలు అదనంగా ఇవ్వగలిగితే అదనంగా Fire Stations open చేయడమే కాక పాత ఇంజన్లను condemn చేసి క్రొత్తవి కొనడానికి వీలవుతుంది. అనంతపురం, రాజమండ్రి, కర్నూలు, గుంటూరులలో క్రొత్త Police Stations ఏర్పాటు చేయడం కూడా జరిగింది. పట్టణాల సంఖ్య పెరిగినపుడు పట్టణాలలోని జనసంఖ్య కూడా పెరుగుతోంది. గుంటూరు మొదలగు చోట్ల traffic ఎక్కువ కావడంవల్ల traffic control కు గాను కొన్ని ఏర్పాట్లు చేయవలసి వస్తున్నది. ఇటువంటి చిన్న చిన్న ఖర్చులు పెరగడంవల్ల 5 లక్షల రూపాయలవరకు ఖర్చు పెరిగిందేగాని అదనంగా పోలీసులను బలపర్చడానికి సంఖ్యను పెంచడానికి కాదు. Welfare State లో మనం ఎన్ని క్రొత్త ప్రాజెక్టులు కట్టినా, Thermal Stations, Hydel Stations కట్టినా సాధారణ ప్రజానీకానికి శాంతి భద్రతలు సరిగా లేకపోతే ఇవన్నీ నిరర్థకము అవుతాయి.

పోలీసువారి కృషి ఫలితాలను సరిగ్గా ప్రాజెక్టుల రూపంలోవలె చూపించ లేకపోవచ్చు. ఇతర departmentలలో చూపించినట్లుగా Police Departmentలో లెక్కవేసి చూపించడానికి వీలులేకపోవచ్చు. Police యొక్క efficiency కి వారు చేస్తున్న కార్యక్రమానికి కొలతబద్ద ఏమిటంటే రాష్ట్రంలో శాంతి భద్రతలు ఎట్లా ఉన్నాయి, రాష్ట్రములో దుర్మార్గులైనవారి పరిస్థితి అదుపులో ఉన్నదా లేక హద్దుమీరి పోయిందా, అనే విషయాన్ని గురించి ఆలోచిస్తే ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన ఈ 2, 3 సంవత్సరాలలోను Police వారు జరిపిన కార్యక్రమము చాలా శ్లాఘనీయంగా ఉన్నదని మాత్రం నేను చెప్పగలను. Decoity లు, ఖూనీలు, దొంగతనాలు మొదలైనవి వాటి సంఖ్య గడచిన సంవత్సరం కన్నా ఈ సంవత్సరం చాలా తగ్గినట్లు అంచనాలు లెక్కలు

తెలుపుతున్నాయి. Decoity లు 42% robberies 46% house breaking 22.4% తగ్గినట్లు లెక్క వేశారు. Major thefts 16.5% పశువుల ఎత్తుకు పోవడం మొదలగు చిన్న చిన్న దొంగతనాలు 10.17% వరకు తగ్గినాయి. ఇకపోతే ఖూనీల విషయంలో మాత్రం తగ్గినాయని చెప్పుకోడానికి వీలులేనటువంటి పరిస్థితి ఏర్పడింది. లెక్కవేసినట్లుగా క్రిందటి సంవత్సరం ఎంతమందిని చంపారో ఈ సంవత్సరం కూడా అంతమందినే చంపారు.

రాష్ట్రంలో 473 మంది గడచిన సంవత్సరము ఈ సంవత్సరము ఖూనీచేయబడడం చాలా విచారకరము. వ్యక్తిగతంగా ఉండే ఈర్ష్యలవల్ల, అసూయవల్ల, లేదా ఆస్తులకు సంబంధించిన, స్త్రీలకు సంబంధించిన తగాదాలవల్ల తరచు ఇలాంటి ఖూనీలు జరుగుతూ ఉంటాయి. అందులో కొన్ని ప్రాంతాలు వాటికి ప్రసిద్ధమైనవి. పల్నాడు, రేనాడు, వీటికి ముఖ్యమైనవి. "అలా జరగడానికి కారణం ఆ గడ్డలో ఉన్నటువంటి పౌరుషం" అని నాగిరెడ్డిగారు అంటున్నారు. పౌరుషాన్ని ఆ విధంగా ఉపయోగించడం చాలా విచారకరము. ఖూనీలను హద్దులో పెట్టడానికిగాను మంచి మంచి officers ను, మంచి ఉద్యోగస్థులను వేయడం మొదలగు ప్రయత్నాలు ఎన్నో చేశాము. క్రొత్తగా Preventive Police Stations కూడా పెట్టాము. Preventive Police Stations అన్నీ కూడా ఈ ప్రాంతంలోనే పెట్టాము. అనంతపురంతాలూకా తాడిపత్రి తాలూకా పల్నాడుతాలూకా మొదలైనచోట్ల Preventive Police Stations పెట్టాము. వీరు వారు అనే విచక్షణ లేకుండ కఠినమైన చర్యలు తీసుకోవడం కూడా జరిగింది. రాజకీయంగా చెప్పుకోతగ్గ raids గాని అలజడి కలిగించే పరిస్థితులు గాని లేకపోవడం చాలా సంతోషకరమైన విషయం. పోలీసువారు తమ బలాన్నిగాని, లాఠీనిగాని తుపాకీని గాని వినియోగించవలసిన పరిస్థితులు ఇంతవరకు కలగకపోవడం అనేది మనం అందరముకూడా సంతోషించవలసిన విషయము. కలగకపోవడానికి కారణం అక్కడక్కడ ఉద్రేకపరిస్థితులు లేవనికాదు. ఉద్రేకపరిస్థితులు ఉన్నప్పటికినీ Police వారు చాకచక్యంతో వాటిని సర్దుబాటుచేశారు. ఇతర రాష్ట్రాలలో వలె అలజడి కలిగించే వాతావరణం పరిస్థితులు మనకు లేకపోలేదు. భాషాప్రయుక్తరాష్ట్రాల విషయంలో ఎంతో అలజడి కలిగింది. ఇతర రాష్ట్రాలలో ఒకరినొకరు చంపుకోవడమో లేక ప్రమాదాలకు గురికావడమో జరుగుతూ ఉంటే మన రాష్ట్రంలో ప్రజలు, పోలీసులుకూడా పరిస్థితులను అదుపులో పెట్టుకొని మనయొక్క యిష్టాయిష్టాలను ఢిల్లీ ప్రభుత్వానికి తెలియచేయుటకుగాను ఎంతో కృషిచేశాము.

తత్ఫలితంగానే మనకు విశాలాంధ్ర రావడం కూడ జరిగింది. దీనికి ఇంత ఉద్రిక్తమైన పరిస్థితులు ఉన్నా, ఎక్కడ కూడా రక్తపాతానికి దారితీసే అవకాశము కలుగనందుకు మన ప్రజలను, పోలీసువారిని అభినందించాలి.

ఇక పోలీసువారి యొక్క, అనగా చిన్న ఉద్యోగస్థులయొక్క జీతాలు allowances పెంచలేదని కొన్ని Cut motions ఇచ్చినారు. నేను వారి అభిప్రాయంతో సంపూర్ణముగా ఏకీభవిస్తున్నాను. ఈ చిన్న పోలీసు ఉద్యోగస్థుల జీతాలు పెంచకపోయినా, వారి బత్యాలు అయినా పెంచాలి. అయితే, ఇప్పుడు వెంటనే అవి పెంచడానికి అవకాశాలు ఉన్నాయా లేదా, ఇక్కడ ఉన్న పోలీసు ఉద్యోగస్థులకు జీతాలు, బత్యాలు ఎట్లున్నవి, హైదరాబాదులో వారి పరిస్థితి ఎట్లున్నది, మనము వారు

(Sri N. Sanjeeva Reddi) [17th March 1956

కలిసిపోయిన తరువాత మన ఆర్థిక పరిస్థితులు ఎట్లా ఉంటాయి, ఈ పోలీసు ఉద్యోగస్థులకు allowances ఎక్కిస్తే, మిగిలిన ఉద్యోగస్థుల పరిస్థితి ఎట్లు ఉంటుంది అని ఇవన్నీ కూడ జాగ్రత్తగా పరిశీలన చేసుకొని ఇవ్వాలి. పోలీసువారి విషయంలోను, చిన్న ఉద్యోగస్థుల విషయంలోను సానుభూతి నాకుకూడ ఉన్నది. Constables కు Head Constables కు, SubInspector కు బాడుగ లేకుండా ఇళ్ళు ఇవ్వవలసిన బాధ్యత ప్రభుత్వముపైన ఉన్నమాట నిజమే. ఇప్పుడు దాదాపు సగము ఇళ్ళు మాత్రమే ప్రభుత్వము కట్టించినవి ఉన్నవి. మిగిలిన సగము కట్టించాలి. కాని ఒకే పర్యాయము ఇన్ని వేల మందికి ఇళ్ళు కట్టించడం అంత సులభమైన విషయంకాదు. ఈ విషయమై ఢిల్లీ ప్రభుత్వంతో సంప్రతింపులు జరుపుతూ ఉన్నాము. Planning విషయాలకు సంబంధించినది కాక పోలీసువారికి ఇళ్ళ వసతులు కల్పించడానికి గాను అప్పులు మంజూరు చేయవలసిందని అక్కడ Home department వారికి వ్రాసినాము. వారుకూడ ఇందుకు సుముఖులుగా ఉన్నట్లు కనిపిస్తున్నారు. ప్రత్యేకంగా పోలీసు వారి ఇళ్ళ వసతికిగానే కొన్ని లక్షలు అప్పు సంపాదించి రాబున్న ఒకటి, రెండు సంవత్సరములలో వారికి ఇంటి వసతి కల్పించాలని కృషి చేస్తున్నాము. S. A. P. వారికి కూడ ఇళ్ళులేవు. ఇళ్ళులేకపోవడం వల్ల, చాలామంది సంవత్సరముల తరబడి తమకుటుంబాలను ఎక్కడో వదలి అక్కడ విశాఖపట్టణములోను హిందూపురము లోను, ఇక్కడ కర్నూలులోను ఉండడం జరుగుతున్నది. వారి ఇళ్ళకుగాను ఇక్కడ కొన్నిలక్షల రూపాయలు కేటాయించాముగానీ, అది ఏమాత్రముసరిపోదు. ఇంకా అలాంటి లక్షలు ఎన్నో కావాలి. కనుక ఢిల్లీ ప్రభుత్వముయొక్క సహాయాన్ని అపేక్షిస్తూ వారి సహాయము మనకు లభించిన వెంటనే ఆ కార్యక్రమానికి పూనుకొంటాము. ఈ సంవత్సరము మన రాష్ట్రములో ఒక Police Training College ప్రారంభించిన విషయము సభ్యులందరికి తెలుసు. ఇదివరకు మనకు ప్రతిచిన్న విషయానికి కావలసినటువంటి Finger Print Bureau గాని, కనీసం ఒక Band గని లేనటువంటి పరిస్థితులలో మన రాష్ట్రాన్ని ప్రారంభించిన విషయము శాసనసభ్యు లందరికి తెలుసును. ఇప్పుడు మనము ప్రత్యేకంగా ఒక Police Training College ఏర్పాటు చేసుకోవడం వల్ల ఇది ఆ లోపాన్ని తీరుస్తుంది. అక్కడ మనకు కావలసిన పోలీసు ఉద్యోగస్థు లందరికి Training ఇచ్చుకోవడమే కాకుండా technical cases కనిపెట్టడానికి అనువైన పద్ధతులలో పోలీసు ఉద్యోగస్థులను తయారు చేసుకోడానికి కూడ వీలు అవుతుందని మనవి చేస్తున్నాను.

ఇక ఈమధ్యనే పోలీసు డిపార్టుమెంటు Prohibition పని కూడ స్వీకరించింది. ఇది చాలా కష్టతరమైన కార్యక్రమము. ఇదివరకు Prohibition Department వారు శక్తివంచనలేకుండా ప్రయత్నించారు. కాని వారికి సరియైన training, security లేకపోవడంవల్ల చాలా ఇబ్బందులకు గురి అయినారు. వారి అధికారాలుకూడా చాలా limited గా ఉంచేసినవి. ఏ Prohibition Sub-Inspector అయినా ఒక గ్రామానికిపోయి ఈ విషయములో ప్రజల సహాయాన్ని అపేక్షిస్తే మంచితనముతో ఎవరో ఒకరిద్దరు ఎక్కడో సహాయముచేస్తే చేస్తారేమోగాని భయభక్తులతో ఇది మన కార్యక్రమము, ఇది మనము చేయవలసిన పని, అనే బాధ్యతను ప్రజలు గుర్తించక వీరికి సరియైన సహాయాన్ని ఇవ్వడంలేదు. Prohibition Department వారు

గ్రామాలకు పోయి ఈ విషయాలు raise చేసినప్పుడు పలుమారు వారే (Prohibition Department ఉద్యోగస్థులే) ఇబ్బందులకు గురికావలసి వచ్చింది. కనుక ఈలాంటి అవకతవకలన్నీ తొలగించడానికి గాను, ఈ అధికారాలను బలముగలిగినటువంటి పోలీసువారికే అప్పజెప్పితే ఇంకా ఎక్కువ efficient గా prohibition enforcement జరుగుతుందని నేను మొదటనుంచి చెప్పుతూఉండేవాడిని. ఏడు, ఎనిమిది ఏళ్ళకు పూర్వమే, మద్రాసులో నేను Prohibition Minister గా ఉన్నప్పుడు, ఈ సలహాను ప్రభుత్వానికి ఇచ్చాను Prohibition Department ప్రత్యేకంగా ఉన్నంతవరకు ఇది ineffective గా ఉంటుందని అప్పుడు Chief Minister గా ఉన్న కుమారస్వామిరాజాగారికి Prohibition Minister గా నేను వ్రాశాను. కాని Police Department లో demoralization వస్తుందనే భయమువల్లను, మరేహో ఇతర కారణాలవల్లను, అప్పుడు అది అంగీకరించలేదు. కాని ఇప్పుడు ఈ ఆంధ్రరాష్ట్రి ప్రభుత్వము నా సలహాను అంగీకరించి Prohibition Department ప్రత్యేకంగా ఉండవలసిన అవసరం లేదని Police Department కే ఈ enforcement work అప్పగించడం జరిగింది. Prohibition Department లో ఉన్న సరియైన వయస్సు, యోగ్యత కలిగి మంచి record కలిగిన ఉద్యోగస్థుల నందరిని Police Department లో absorb చేసుకొంటున్నాము. వారందరిని ఇప్పుడు Police Training College కి పంపించినాము. అక్కడ వారు training అవుతున్నారు. ఇంక 1, 2 నెలలలో వారు బయటికి రావడము, వారికి Postings ఇవ్వడము కూడ జరుగుతుంది ఇంతకుముందు ఈ Prohibition Department లో ఉన్నవారికి proper training లేదు. తుపాకులు వాడడం గాని, సరియైన చట్టాలు చదువుకొని తయారుగా ఉండడంగాని తెలియదు కాబట్టే వారికి ఈ training ఇస్తున్నాము. Training అయిన తరువాత, వారు కూడ మామూలు పోలీసువారితో సమానంగా ఈ కార్యక్రమానికి పూనుకొంటారని, వీరు Prohibition Department వారు అని ఇతరులు వేలుపెట్టి చూపించలేని విధముగా వీరి శక్తి సామర్థ్యాలు ప్రదర్శిస్తారని ఆశిస్తున్నాను కొందరు Prohibition Department లో హెచ్చు జీతాలు తీసుకొంటున్న వారికి, ఇక్కడ సరియైన హోదా ఇవ్వలేకుండా వున్నాము. కొందరు అక్కడ Assistant Prohibition Officers గా ఉన్నవారికి కూడ Police Department లో Sub Inspectors గా మాత్రమే తీసుకోగలుగుతున్నాము. అక్కడ District Prohibition Officers గా ఉన్నవారిని ఇక్కడ Dy Superintendent గా మాత్రమే తీసుకోగలుగుతున్నాము. పోలీసు డిపార్టుమెంటులో ఉన్న కార్యక్రమాలలో వీరికి కొంతకాలం అనుభవము కలిగితే తప్పకుండా వీరికి పై ఉద్యోగాలు ఇవ్వడానికి ఏలాంటి ఆక్షేపణ ఉండదు. వారు College లో training కావడం మాత్రమే చాలదు కొంత అనుభవం కూడ కావాలి. కాని వారి జీతాలు మాత్రం ఎప్పుడూ తగ్గించబడవు. వారు Sub Inspectors గానే పనిచేస్తూ ఉండినా, జీతము మాత్రము ఎక్కువగా తీసుకొంటూనే ఉండడానికి అవకాశాలు కల్పిస్తున్నాము. కాబట్టి Prohibition Department నుంచి Police Department కు వచ్చిన వారు తమ కేదో నష్టము కలిగిందని భావించవలసిన అవసరం లేదు అని నేను వారికి హామీ ఇస్తున్నాను. ఇక శక్తివంచన లేకుండా పనిచేసే పెద్దఉద్యోగస్థులను అతి త్వరలోనే Circle Inspector

గాను ఇంకా పై ఉద్యోగాలకు promotion ఇవ్వడానికినీ Police Department వారికి కావలసిన instructions కూడా యివ్వ బడినాయి. కనుక వారు దీన్ని గమనించి తమ శక్తి సామర్థ్యాలు వినియోగించి కార్యక్రమాలను శ్రద్ధతో పూనుకొంటారని అనుకొంటాను.

ఇక Fire Station విషయము నేను చెప్పాను. Municipal towns లోను ఇంకను చాలా చోట్ల Fire Stations లేవు. సంవత్సరం 7,8 అయినా ప్రారంభిస్తామని గాని, ప్రతిచోట Fire stations స్థాపింపడానికి డబ్బువసతి లేదు అనిగాని, మిత్రులకు తెలుసు. అందుకు గాను ఈ సంవత్సరం గుంతకల్లులోను, భీమవరంలోను, బాపట్లలోను సాలూరులోను ప్రారంభించడానికి మాత్రము ఏర్పాటుచేసు కొంటున్నాము.

ఇంకా మునిసిపల్ టౌన్సు చాలా ఉన్నవి. అందులో చీరాల, కావలి, గూడూరు మొదలైనవి ఎన్నో వున్నవి మునిసిపల్ టౌన్సులోనైనా ప్రారంభిస్తే చాలా బాగుంటుందని నా ఉద్దేశ్యము. అవి అన్నీ గూడ ప్రారంభించటానికి వచ్చే సంవత్సరము పరిస్థితులు ఎట్లా వుంటాయోగాని, కనీసము 70-80 వేల రూపాయలు అయినా కావాలని అనుకుంటాను. ఇప్పుడు ఉన్న పాత engines అన్నీ తీసివేసి కొత్తగా start చేస్తే, బహుశ పీ అరవైవేలో, అంతవరకో అవు తుందని అనుకుంటున్నాను. ఆ ఖర్చుతో యిప్పుడు యీ సంవత్సరమునకు మాత్రము యీ నాలుగు ప్రాంతాలలోను ప్రారంభించటానికి నిశ్చయించుకున్నాము ఇప్పుడు మిగిలిన పరిస్థితులనుబట్టి చూస్తే యీ పోలీసుడిమాండుక్రింద allot చేసిన డబ్బు చాలా తక్కువనే అనుకుంటున్నాము. ఇప్పుడు మన రాష్ట్రములో చాలా ప్రశాంతమైన పరి స్థితులు ఉండడమువల్ల, యితర రాష్ట్రాలకు గూడ మన పోలీసువారిని పంపడము జరిగింది. అంటే యితర రాష్ట్రాలవారికి గూడ మన సహకారము అందజేస్తున్నామన్న మాట. క్రిందటసారి నెహ్రూగారు వచ్చినప్పుడు పాండిచెరీకి గూడ పంపించాము. అక్కడ అదుపు ఆజ్ఞలు సరిపెట్టటానికి, వారికి కావలసిన ఏర్పాట్లు చేయటానికి, మన పోలీసులను పంపించాము. మరల మొన్న మద్రాసుప్రభుత్వమువారు కోరితే, మద్రాసుకు పంపిం చాము. అంటే మన పోలీసువారు యితర రాష్ట్రాలలో గూడ ఎంతవరకు ఉపయో గిస్తున్నారో తెలియడానికి యిది ఒక test గా భావించవచ్చు. మన రాష్ట్రములో గూడ ఉద్రిక్తపరిస్థితులు ఉన్నవని తెలిసి విశాలాంధ్ర విషయములో అక్కడ అవసర మని తోచి, వారిని కొంతమందిని అక్కడికి పంపడమువల్ల, అక్కడగూడా చాలా ప్రశాంతపరిస్థితులు ఏర్పడ్డవి. అందువల్ల మన పోలీసువారు ఎంతో నమ్మకముగాను, సక్రమంగాను వారి విధులు నెరవేర్చుకుంటారని ఒక విశ్వాసము ప్రభుత్వానికి ఏర్పడ్డది. ప్రజలుగూడ శాంతియుత పద్ధతులను గమనించారు గనుక పోలీసువారిని పంపి అదుపులోకి తెచ్చుకోవలసిన అవసరము లేదనే విశ్వాసము నాకు గూడ కలిగింది. కాబట్టే పోలీసువారు కూడ ప్రజలను లాఠీలతోనూ, తుపాకులతోను అదుపులోనికి తీసుకొని రావలసిన అవసరములేదు. ఇతర పరిస్థితులే చాలా అనుకూలంగా ఉంటాయని గమనించాము. అందుకు నాకు చాలా సంతోషము. రాష్ట్రముయొక్క allround progress కు యిది ఒక సూచన అని నా అభిప్రాయము. లేకపోతే, ఎన్నో Development Schemes ఉన్నప్పటికినీ ఆర్థికంగా మనము ఎంత బాగుపడినప్పటి కినీ, విద్యావిషయములో గూడ బాగుపడినప్పటికినీ రాష్ట్రంలో law and order సరిగా లేకపోయే పరిస్థితులు ఏర్పడి, ప్రజలు ప్రశాంతంగా జీవించటానికి సరియైన పరిస్థి

తులు లేకపోతే, యివి అన్నీ చేసి నిరర్థకమనే నా అభిప్రాయము. ఈ కారణముల వల్ల పోలీసువారిని నేను ప్రత్యేకంగా అభినందించటానికి అవకాశము కలిగింది. కాబట్టి శాసన సభ్యులందరు ఈడిమాండును ఏ అభ్యంతరము పెట్టకుండా, ఏకగ్రీవముగా ఆమో దిస్తారని ఆశిస్తున్నాను. ఇంకను వారు జిల్లాలలో ఏమైన మార్పులు చెయ్యాలని. ఏవైనా మంచి సలహాలు, యిస్తే అవి మంచివేనని తోస్తే నేను అంగీకరించటానికి సిద్ధముగా ఉన్నాను. ఇంకను అవసరమైతే యిక్కడ మనకు calm atmosphere ఉన్నది కాబట్టి యీ పోలీసువారిని మరొక పద్ధతిలో ఉపయోగించటానికి ప్రజోపయోగ కరమైన పనులు చేయటానికి గ్రామాలకు పంపటానికి వీలు అవుతుందేమో ఆలోచించండి. అంతేకాని యిప్పుడున్న సంఖ్యను తగ్గించమని అంటేమాత్రము, అది నేను ఒప్పుకోను. మంచిది కాదు కూడా. రాష్ట్రములో శాంతియుతమైన పరిస్థితులు ఉన్నవి కాబట్టి వీరిని తగ్గించడము, మరల అవసరమైనప్పుడు పెట్టుకోవడము అనే పద్ధతిని నేను అంగీకరించను. ఇది ఎట్లా ఉన్నదంటే ఏదో సామెత చెప్పినట్లు దప్పిక అయినప్పుడు బావిత్రవ్వ కున్నట్లుగా వున్నది. కాబట్టి ఎప్పుడు ఎలాంటి పరిస్థితులు వస్తాయో మనకు తెలియదు అలాంటి పరిస్థితులు వచ్చినప్పుడు పోలీసువారిని రమ్మని పిలవడము, లేనప్పుడు పొమ్మన డం, సాధ్యమయ్యే వ్యవహారము కాదు. కాబట్టి యిప్పుడు ఉన్న సంఖ్యను యికవిూదట పెంచకుండావున్న సంఖ్యను యిట్లాగే ఉంచి, వీరిని యింకా ఏదైనా మంచి పద్ధతిలో ప్రజలకు ఉపయోగించే పద్ధతిలో దీనియొక్క services ను వినియోగించటానికి సూచనలుచేస్తే ప్రభుత్వము అవి పరిశీలించి సరియైనవని తోస్తే వాటిని తప్పకుండా అంగీకరించటానికి సిద్ధముగా ఉంటని చెబుతున్నాను. కాబట్టి నేను ప్రతిపా దించిన యీ మూడు డిమాండ్లను అందరు ఏకగ్రీవముగా ఆమోదించమని కోరుతున్నాను,

Mr SPEAKER —Motion moved

[1] That Government be granted a sum not exceeding Rs 65,83,900 under Demand XII –Administration of Justice.

[2] That Government be granted a sum not exceeding Rs 2,71,00,000 under Demand XIV–Police.

[3] That Government be granted a sum not exceeding Rs. 24,06,000 under Demand XIII – Jails

Sri PILLALAMARRI VENKATESWARLU —

Mr. Speaker, Sir, I beg to move

To reduce the allotment of Rs. 65,83,900/- for Administration of Justice by Rs. 100/-

(To discuss the failure of the Government to check the influence of the Executive over the Judiciary.)

Sri S. RANGANATHA MUDALIAR .—

Mr. Speaker, Sir, I beg to move :

To reduce the allotment of Rs 65,83,900/- for Administration of Justice by Rs. 100/-

[To discuss the need for the appointment of an additional Public Prosecutor for Chittoor district and also the need for raising the salaries of Assistant Public Prosecutors ]

Sri VAVILALA GOPALAKRISHNAYYA —
Mr Speaker, Sir, I beg to move
To reduce the allotment of Rs 65,83,900/- for Administration of Justice by Rs. 100/-
(సత్తెనపల్లిలో జిల్లా మునసబు కోర్టు ఏర్పాటు చేయవలయునని కోరుతూ)

Sri PILLALAMARRI VENKATESWARLU —
Mr Speaker, Sir, I beg to move ·
To reduce the allotment of Rs 24,06,000/- for Jails by Rs 100/-
[to discuss the failure of the Government to effect Jail reforms ]

Sri VAVILALA GOPALAKRISHNAYYA —
Mr Speaker, Sir, I beg to move
To reduce the allotment of Rs 24,06,000/- for Jails by Rs. 100/-
(గుంటూరులోనున్న సబ్ జైలును స్పెషల్ జైలు చేయవలెనని)

Sri S VEMAYYA —Mr Speaker, Sir, I beg to move .
To reduce the allotment of Rs 2,71,00,000/- for Police by Rs. 100/-
(for the failure of the Government to enhance dearness allowance of Constabulary from 12 annas to Rs. 2-0-0)

Sri VAVILALA GOPALAKRISHNAYYA —
Mr. Sperker, Sir, I beg to move
To reduee the allotment of Rs 2,71,00,000 for Police by Rs. 100/-
(సమావేశములకు మైక్‌పర్మిషన్ డి. యస్. పి. కాకుండా సబ్ యిన్‌స్పెక్టరు యివ్వవచ్చునని ఆర్డరులు జారీచేయవలెనని)

Sri PILLALAMARRI VENKATESWARLU — Mr. Speaker, Sir, I beg to move

To reduce the allotment of Rs 2,71,00,000/- for Police by — Rs 100/-

(to discuss the harassment caused by the Police authorities to the citizens in day-to-day administration)

Sri M NAGI REDDI.— Mr Speaker, Sir I beg to move

To reduce the allotment of Rs 2,71,00,000/- for Police by — Rs. 100/-

(పోలీసు డిపార్టుమెంటులో జరుగుచున్న అధిక వ్యయమును, లంచగొండి తనమును అరికట్టుటకు ప్రభుత్వము పూనుకోనందులకు)

Sri M NAGI REDDI.—Mr. Speaker, Sir, I beg to move

To reduce the allotment of Rs. 2,71,00,000/- for Police by — Rs. 100/-

(త్రాగి తందనాలాడే పోలీసులను పట్టుకొని డాక్టరుకు అప్పగించే అధికారం ప్రజలకు కలిగించుటకు ప్రభుత్వం అవకాశం కల్పించనందుకు)

Sri S. RANGANATHA MUDALIAR .— Mr Speaker, Sir, I beg to move

To reduce the allotment of Rs 2,71,00,000/- for Police by — Rs. 100/-

[To discuss the measures needed to improve the condition of the Police in regard to pay, houses accommodation, social amenities etc ]

Sri M SATYANARAYANA RAJU—Mr Speaker Sir, I beg to move

To reduce the allotment of Rs. 2,71,00,000/- for Police by — Rs. 100/-

[for the failure of the Government to conduct the administration of law and order properly.]

Sri B. RAMA REDDI —Mr Speaker, Sir, I beg to move

To reduce the allotment of Rs. 2,71,00,000/- for Police by Rs. 100/-

[to criticise the Government for not increasing the salaries of the constables ]

Mr. SPEAKER —The main Demands and the cut motions are now before the House for discussion

Sri P GUNNAYYA —అధ్యక్షా ! పోలీసు డిమాండుమీద మాట్లాడవలెనని నాకు చాలా ఉత్సాహముగా ఉన్నది. నేను ఒక cut motion ను గూడయిచ్చాను.

Mr SPEAKER —Cut motion ను move చేస్తారా ?

Sri P GUNNAYYA —Move చేయడానికి కాదండి మాట్లాడడానికి అవకాశము యివ్వండి.

Mr. SPEAKER —చూస్తాను.

*Sri S. VEMAYYA :— అధ్యక్షా, ఈనాడు మనఎదుట ఉపముఖ్యమంత్రి గారు ప్రతిపాదించిన మూడు డిమాండ్లు, అందులో ముఖ్యంగా "Justice" మీద Demand ను గురించి కొన్ని విషయాలు ప్రభుత్వ దృష్టికి తీసుకునివస్తున్నాను. దీనికి సంబంధించిన ఉద్యోగస్థులకు నెలజీతము నాలుగు వేలు యిస్తున్నారు. అందులోనే ఆఫీసులో పనిచేసే జమానుకు నెలకు 18 రూపాయల జీతము ఉన్నది. Socialistic Pattern of Society ని మనము ఏర్పాటు చేసుకుంటున్నప్పుడు వీరి జీతములు ఏ ratio లో ఉన్నదంటే, 1 222.3 తేడాతో ఉంటున్నది. అంటే జమానుకు ఒక రూపాయి ఉంటే, అతని ఆఫీసరుకు 222,3 రూపాయల వరకు తేడాలో ఉన్నది. ఒకేఒక స్థానములో మరె ప్రదేశములోనైనా యిటువంటి తేడాతో ఏ ప్రభుత్వము అయినా జరుపుతున్నదంటే, అప్పుడు మనం State లో పురోగమిస్తున్నామో లేదో చూచుకుంటే నిజముగా న్యాయస్థానములో ఉండేవారికి, వారి పనిచేసేవారికి యింత పెద్ద వ్యత్యాసములేకుండా చేయటానికి ప్రభుత్వము పూనుకుంటున్నదంటే అది యేమాత్రము కన్పించడములేదు. కనీసము చిన్నజీతాలవారికైనా, అంటే Attenders, Peons, వగైరాలకు యిచ్చే జీతాలు నెలకు 24 రూపాయిలు ఉన్నది. ఈ వ్యత్యాసాలు అన్నీ గూడ సాధ్యమైనంతవరకు మార్పుచేయటానికి ప్రభుత్వము ప్రయత్నిస్తే, వారు వారి యొక్క ఆఫీసు పనలు నెరవేర్చటానికి ఉపయోగముగా ఉంటుంది. ముఖ్యంగా peons విషయము తీసుకుంటే, వాళ్ళు ఆఫీసువేళకు ఏ నాలుగు అయిదు గంటలు ముందుగా బయలుదేరాల్సివున్నది. కారణము యేమిటంటే, వాళ్ళయొక్క ఆఫీసర్ల యింటికిపోయి, ఆయన స్వంతపనులు నెరవేర్చాలి. తరువాత అయిదుగంటలదాక ఆఫీసులో పనిచేయాలి. సాయంత్రము తిరిగి ఆఫీసరు యింటిపనులు చేయాలి. తీరా అతను యింటికి చేరేటప్పటికి రాత్రి ఏ పదిగంటలో అవుతుంది. ఆఫీసరు చూస్తే, ఆఫీసుకు 11 గంటలకు వచ్చి, 5 గంటలకు యింటికి వెళ్లుతాడు. జమాను

ఉదయము ఆరుగంటలు మొదలు రాత్రి పదిగంటలవరకూ పనిచేయాలి. కాబట్టి అతను పనిచేయు గంటలు ఎన్నో లెక్క చూడండి. దీన్నిబట్టి పని భారము, జీతము కొద్ది. ఆఫీసరు చేసేది ఎన్నిగంటలో, జమాను చేసేది ఎన్నిగంటలో చూడండి. జీతములోను పనిలోను చాలా వ్యత్యాసము ఉన్నది గనుక యీ వ్యత్యాసము తగ్గించి, జీతము proportionate గా పెంచాలని అంటున్నాను. కాబట్టి యీ చిన్న జీతాలవారికి జీతములోనూ, పనిలోను వ్యత్యాసములు సరిచేయాలని నా అభిప్రాయము.

కొన్ని తరగతుల గవర్నమెంటు ఉద్యోగస్థుల జీతాల విషయం చూచినప్పుడు Assistant Public Prosecutors కు 200 రూపాయిలు జీతం ఇస్తున్నారు. Additional I Class Magistrate లకు 200 రూపాయిలు ఇస్తున్నారు. వాళ్ళు Private Practice పెట్టుకుంటే నెలకు కనీసం 700 రూపాయిలనుంచి వెయ్యి రూపాయిల వరకూ సంపాదించే వారున్నారు. కనుక ఈ విషయం ఆలోచించి వారికి న్యాయంగా జీతాలు పెంచితే వారి విధి సక్రమంగా నెరవేర్చుటకు వీలుంటుంది. ఇంకా మూడు జిల్లాలలో Separation of Judiciary from theExecutive scheme అమలుజరపలేదని మంత్రిగారు చెప్పారు. Justice సక్రమంగా అమలు జరగాలంటే ఎంత త్వరగా యీపని పూర్తిచేస్తే అంత బాగుంటుందనీ జాప్యంచేయడం సబబుకాదనీ మనవిచేస్తున్నాను. I Class Magistrates deal చేసేటటువంటి కేసులలో, executive వాళ్లకే Sections 144, 107, 145 క్రింద powers ఉంటున్నాయి. ఇటువంటి security కేసులు పెట్టినప్పుడు నూరు మైళ్ళ పైబడిన ప్రదేశాల నుంచి కూడా సాక్షులు, పార్టీలు కూడా రావడం సంభవిస్తోంది. అందువల్ల మన రాష్ట్రంలో (ఇతర రాష్ట్రాలకు model గా ఉండుటకు) Mobile Courts start చేస్తే, వారు ఆ దూరంగా ఉన్న ప్రదేశాలలో జరిగిన కేసులు అక్కడకే పోయి విచారించడానికి వీలుగా ఉంటుంది. అక్కడున్న ప్రజలకు అందుబాటులో ఉంటుంది న్యాయ నిర్వహణ. అంత ఖర్చుతో కూడుకున్నదిగా ఉండకుండా ఉంటుంది. దూర గ్రామాల నుంచి వచ్చేవారికిచ్చే T. A. లు అవి ఎక్కువగా ఇవ్వవలసిన అగత్యం ఉండదు. అందువల్ల దగ్గరనున్న ప్రదేశాలకు వెళ్లి అక్కడే ఈ కేసులు విచారించేటట్లుగా ఉత్తరవులు వెంటనే జారీ చెయించవలసినదని కోరుతున్నాను. Summons serve చేసే విషయంలో సరిగా serve చేయడడంలేదు. ఈ summons పోలీసువారు serve చేయడంలో పార్టీలు లేరనీ, లేక పుచ్చుకోడానికి నిరాకరించారనీ warrants జారీ చేయించుచున్నారు. ఆ warrant వచ్చిందని అక్కడున్న ఆసామీకి తెలియకుండానే వారిని పోలీసువారు తీసుకుపోయి remand లో పెడుతున్నారు. అందువల్ల ఈ summons పోలీసువారిచేత serve చేయించే విధానం మార్చి registered post ద్వారా పంపించే ఏర్పాట్లు చేస్తే బాగా ఉంటుంది. డబ్బుకూడా మిగులుతుంది. సమన్లు న్యాయంగా అమలు జరుగుతాయి.

Remand లో ఉన్నవారిని bail మీద తీసుకురావాలంటే certificate కావాలని insist చేస్తారు. ఈ certificate లు ఇవ్వడానికి గ్రామాధికార్లు చాలా చోట్ల నిరాకరిస్తున్నారు. గ్రామాధికార్లు కాని, క్రింది ఉద్యోగస్థులు కాని, ఈ certifi-

cate లు ఇవ్వడం నిరాకరించినట్లైతే ప్రభుత్వం వారి దృష్టికి తీసుకువస్తే ఏదైనా చర్య తీసుకొని, దాని విషయమై తగిన rules frame చెయ్యాలని కూడా మనవిచేస్తున్నాను.

జైలు శిక్ష వేసినప్పుడు అతని బంధువులకు అతని స్వగ్రామానికి దూరంగా ఉండే జైలుకు పంపకుండా, సాధ్యమైనంతవరకూ అతని బంధువులకూ, స్వగ్రామానికి దగ్గరలో ఉండే జైలులోనే ఉంచడం వాంఛనీయమని నేను ప్రభుత్వానికి మనవి చేస్తున్నాను.

Court లో Judgment copy లకు పెట్టినప్పుడు చాలా delay చేస్తున్నారు. అవి తొందరగా ఇవ్వాలని ఉత్తరువులు పంపాలని ప్రభుత్వానికి మనవి చేస్తున్నాను. పోలీసువారు పెట్టిన case లలో సాక్ష్యం ఇవ్వడానికి కోర్టుకు వచ్చిన సాక్షులకు T.A. లు ఇస్తే, ఆ సాక్షులు సాధారణంగా చదువురాని గ్రామస్థులై యుంటారు కాబట్టి వాళ్ళ సంతకమో, వేలుముద్రో వేయించుకొని పోలీసువారే తీసుకోవడం జరుగుతోంది. ఈ T A. డబ్బు ఆ సాక్షులకు ముట్టేటట్లు ప్రభుత్వము చర్య తీసుకుంటుందని ఆశిస్తున్నాను. మన రాష్ట్రంలో శిక్షపడిన ఖైదీలను ఇతర రాష్ట్రాల జైళ్ళలో ఉంచవలసి రావడంవల్ల గత బడ్జెటులో 11 92 లక్షలు మన ప్రభుత్వం ఇతర రాష్ట్రాల ప్రభుత్వాలకు ఇచ్చినట్లు కనబడుతోంది. ఆ డబ్బు ఇతర రాష్ట్రాలకు చెల్లించే బదులు దానితో మన రాష్ట్రంలోనే certified schools గాని, central Jails కాని కడితే ఆ డబ్బు మనకే మిగులుతుంది. ఈ విషయంలో ప్రభుత్వం తగుచర్య తీసుకోవాలని మనవి చేస్తున్నాను. ఇతర దేశాలతోగాని, ఇతర రాష్ట్రాలతోగాని పోల్చినపుడు మన జైళ్ళు చాలా పురాతనంగా ఉంటున్నవి. జైలు అనే పదం ఉండకూడదని సూచనలు చేయబడినవి. చెరసాల అనడంకన్నా సంస్కరణాలయం అని పేరుపెట్టి, అక్కడ బాధపెట్టే విధానము కాకుండా, నేరస్తులకు మానసికమైన మార్పువచ్చి మంచివారుగా తయారయ్యే విధానం ఎప్పుడు అవలంభిస్తామో అప్పుడు దేశం బాగుపడుతుంది. కాని కొంతమంది మంచివాళ్ళున్నప్పటికీ, జైళ్ళలో ఇతర నేరస్థులతో జతపడి వారింకా తప్పుడుదారి పట్టడానికి చాలా అవకాశాలున్నాయి జైలుకుపోయి వచ్చినతరువాత మళ్ళీ నేరాలు చేయడానికి తయారవుతున్నారు. అందుచేత అవి jails గా కాకుండా సంస్కరణాలయాలుగా తయారు కావాలని మనవిచేస్తున్నాను Jails అనేవి బాధించేవిగా ఎంతమాత్రం ఉండకూడదని మనవిచేస్తున్నాను. ఈ jails చీకటి కొట్లవలె ఉండి గాలికూడా రానటువంటి స్థితిలో ఉంటున్నవి. అధికార్లు ఎవరైనా అకస్మాత్తుగా పోయి చూస్తే దుర్వాసనతో ఈగలు ముసురుతూ దుర్గంధంతో insanitary గా వుంటున్నవి. అందువల్ల ఆ జైళ్లు కలరా, నెత్తురుబంక మొదలైన అంటురోగాలకు గురిఅవుతున్నవి. Doctor వచ్చి చూచి మందులిచ్చే సదుపాయాలు కూడా చాలా తక్కువగా వుంటున్నవి. ఉమ్మడి మదరాసు రాష్ట్రంలో మనం వున్నప్పుడు ఈ jail report చూస్తే జైళ్ళలో ప్రతి సంవత్సరం చనిపోయిన వారి సంఖ్య ఎక్కువగా కనిపిస్తోంది. దాన్ని అరికట్టడానికి ప్రభుత్వం ఏమి చర్యలు తీసుకుంటుందో మన మంత్రిగారు చెప్పలేదు. వారికి వైద్య సదుపాయాలు ఏర్పడాలని, వైద్యసహాయం వెంటనే రోగికి అందజేయడానికి ప్రభుత్వం తగినశ్రద్ధ తీసుకుంటుందని ఆశిస్తున్నాను.

జైళ్ళలో epidemic diseases పెరగకుండా సదుపాయాలు కలుగజేయాలి. అక్కడ ఖైదీలకు ఏదైనా తగాయిదా వచ్చినప్పుడు వెంటనే Medical relief-

17th March 1956] [Sri S. Vemayya]

జరుగకుండా జాప్యం కలుగుతూ ఉంది. అట్లా కాకుండా త్వరగా వైద్య సహాయం లభించేటట్లు చేస్తే వ్యాధులు లేకుండ ఉంటవి. మన ప్రస్తుత పరిస్థితులకు అనుగుణముగా జైళ్ళను మార్చవలెనని మనవి చేస్తున్నాను.

జెయిలరుకు జీతం. రూ 80 నుంచి రూ 90 వరకు, వార్డర్లకు రూ 18. ఎటెండర్లకు రూ 24, ఆర్డర్లీలకు రూ 24, ఈ మాదిరిగా జీతాలున్నవి. ఈ జీతాలతో వారు సక్రమంగా పనిచేస్తారని నమ్మకంలేదు. జెయిళ్ళలో ఉన్నవారిని పీడించుకొని వస్తువులను పంపితే మధ్యలో అర్ధము కత్తిరించే పద్ధతిలో ఉన్నారు. కాబట్టి వారి జీతాలను పెంచడానికి ప్రభుత్వం పూనుకొనవలెనని మనవిచేస్తున్నాను. అప్పుడే వారు సక్రమముగా పనిచేయడానికి వీలుంటుంది. ఈ జీతాలు చాలా స్వల్పంగా ఉండడం సబబుగాలేదు. జెయిళ్లలో ఉన్నప్పుడు సాయంత్రం తీరిక సమయములలో రేడియోలు వగైరాలు పెట్టి వారికి మానసిక సంతోషం కలుగజేయడానికి ప్రభుత్వం పూనుకొనవలెను. ప్రతి sub-jail లో రేడియో సెట్టు పెట్టవలెనని నేను మనవి చేస్తున్నాను. ఎప్పుడూ కూడా జెయిల్ రూల్సులో 24 గంటలు కొట్లలో ఉంచాలని లేదు. ఆరుబయటకు తీసుకొని రావలెనని రూలు వున్నది. కాని ఎప్పుడూ కూడా ఆరు బయటకు తీసుకురారు. ఉదయం, సాయంకాలము ఒక ½ గంటసేపు మాత్రము బయటకు తీసుకు రావడము మిగతా టైములో Cells లోనే ఉంచుతూ ఉన్నారు. ఇది రూల్సుకు వ్యతిరేకం. దీనికి స్వస్తి చెప్పాలని మనవి చేస్తున్నాను. Jails ను మన రాష్ట్రంలో కట్టుకొనవలెను. వాటిని "సంస్కరణాలయములు" గా యుంచవలయును. స్త్రీలను, పురుషులను ఒకే జైలులో ఉంచడం అంతమంచి కాదు. వేరే వేరే Cells లో వుంటారు ఆడవాళ్ళు, మగవాళ్ళు కలవడం లేదని చెప్పవచ్చును. పత్యేకమైన జైళ్ళను, Exclusive గా వుండేటట్లు జైళ్ళను కట్టవలెను. ఈ రెండు mix చెయ్యడం సబబు కాదు. దీనికి మంత్రిగారు వెంటనే పూనుకొనవలెను.

జెయిలు రిఫారమ్స్ కమిటీవారు చాలా సూచన లిచ్చారు. ఆ సూచనలలో ఏ యే సూచనలు ప్రభుత్వం అమలు జరుపుతుంది అని నేను ప్రశ్న సూటిగా అడుగుతున్నాను. వాటిని ప్రభుత్వం అమలు చేస్తుందా ! ఈ రిపోర్టువచ్చి ఎంతకాలమైంది ? ఆర్థికముగా ప్రజలను, బాగుచేయ లేకపోయినప్పుడు నేరాలు తగ్గడానికి వీలుకాదు. ఆర్థిక బాధలు ప్రజల కున్నంతకాలము వారిని మనము చక్కపెట్టలేమని ఆ రిపోర్టులో వున్నది. దాని విషయమై ప్రభుత్వం ఏమి చేస్తున్నది ? జీవితములో తేడాలున్నంతకాలము పురోగమించడానికి వీలుండదు. Justice జరగదు. నేరాలు తగ్గించడానికి అవకాశ ముండదు. మర్డర్ కేసులు ఎక్కువగా వస్తున్నవని, ఇవన్నీకూడా అనేక కారణాలు పురస్కరించుకొని జరుగుతున్నవని మంత్రిగారు చెప్పారు. పోలీసులలో వున్న మనోప్రవృత్తి ప్రస్తుత రోజుల కనుగుణముగా మార్చుకొనడానికి సరియైన ట్రెయినింగు ఇవ్వవలెను. ప్రజలతో మెలుగుటకు సరియైన ట్రెయినింగు ఇవ్వవలసిన అవసరం ఎంతైనావుంది.

ఈపోలీసులు ఏదైనా కేసులు detect చేసినప్పుడు అనవసరంగా సంకెళ్లు వెయ్యడం జరుగుతున్నది పారిపోయేవాళ్ళకు వెయ్యవచ్చును సామాన్యంగా ప్రతివారికి సంకెళ్లు వేసే అలవాటు అయిపోయింది లంచాలు తీసుకొని వెయ్యకుండా వుండడం కూడావుంది. ఈ సంకెళ్ళు వేసే విధానం ఎందుకు పోలీసులు తీసుకు వస్తున్నారో

విచారించి అటువంటి విధానము అవలంబించ కూడదని ఉత్తరువులు జారీచేయ వలెనని మనవి చేయుచున్నాను. Remand లో నున్నప్పుడు ఆహార విషయమై ఏమి పట్టించుకొనరు. సొంతంగా ఆహారం ఏవరైనా తీసుకొని వస్తామంటే అది కూడా తీసుకోనీకుండా బాధలు పెడుతున్నారు. జబ్బుచేస్తే వెంటనే Hospital కు తీసుకొని పోయే విధానం లేదు, తీరా చావబోయే ముందు మాత్రము తీసుకు వెళ్తారు. ఏదైనా దెబ్బ తగిలితే పోలీసువారు సరియైన ట్రీటుమెంటు ఇవ్వడం లేదు. పశువుల మాదిరిగా cases లో చిక్కిన వారిని అనుమానంలో కస్టడీలోనికి తీసుకొని పోవడం జరుగుతూవుంది. తగలరాని చోట దెబ్బతగిలినా, గాయపడినా, దగ్గరవున్న డాక్టరు వద్దకు పోనివ్వరు. వారు మందులూ ఇవ్వరు. "వుప్పలపాడు"లో మొన్ననే కొన్ని case లలో దెబ్బలు తగిలిన వారిని పోలీసువారు డాక్టరు దగ్గరకు పోనివ్వలేదు. ఈ విషయం నాకు తెలుసును. పోలీసులు ఎంత అమానుషంగా వున్నారో మీ దృష్టికి తీసుకొని వస్తున్నాను. కనీసం డాక్టరు సలహాలైనా తీసుకోకుండా నిర్బంధిస్తున్నారంటే పోలీసుల మనః ప్రవృత్తి ఏ విధంగా వున్నదో తెలుపుతుంది

ఇంతకుముందు వుండేటటువంటి C T. Act తీసివేసి habitual offenders అని మరొక సెక్షన్ పెట్టి అనేకమందిని బాధిస్తున్నారు. గౌరవనీయులైన వారిని కూడా ఈ సెక్షన్ కింద కేసులుపెట్టి బాధిస్తున్నారు ఈ Habitual Offenders Act ప్రకారం కేసులు ఎక్కువగా వున్నవని గెజిట్ లో ప్రకటించారు ఇంతమందిని రిలీజు చేసినాము, ఇంతమందిని అప్ టు డేట్ గా వున్నారు అనీ గెజిట్ లో కనబడుతూ వుంది. మర్యాదగా వున్నవారి మీద కూడా ఈ కేసులు పెడుతున్నారు. దీనికి ఎంత త్వరగా స్వస్తి చెప్తే అంతమంచిది. మర్యాదస్తుల మీద ఈ విధమైన కేసులు పెట్టకూడదని వుత్తరువులు జారీ చెయ్యాలని మనవి చేస్తున్నాను.

పోలీసులకు ఇండ్లవసతి చాలా తక్కువగా వున్నదని cut motion లో చెప్పాము. అడ్మినిస్ట్రేషన్ రిపోర్టులో కూడా వున్నది, వారికి ఎక్కడా సరియైన ఇండ్ల వసతిలేదు. చాలా నికృష్టంగా ఉన్నదని 3 సంవత్సరాల రిపోర్టులో వున్నది కాని వారికి క్వార్టర్సు కట్టే విషయంలో ప్రభుత్వం ఏమీ చర్య తీసుకొనలేదు వారు చాలా అధ్వాన్న స్థితుల్లో వున్నారని అడ్మినిస్ట్రేషన్ రిపోర్టులో కూడా ఈ విషయం ప్రభుత్వ దృష్టికి తీసుకొని రాబడింది. కేంద్ర ప్రభుత్వంతో సంప్రదింపులు చేస్తున్నామన్నారు. కేంద్ర ప్రభుత్వం నుండి వెంటనే subsidy తీసుకొనివచ్చి పోలీసులకు ఇళ్ళు కట్టవలెనని మనవి చేస్తున్నాను.

ప్రొహిబిషన్ కేసులలో అనవసరంగా అనేక వాటిమీద కేసులు పెడుతూవున్నారు. Ex-tappers కు లైసెన్సు యిచ్చు విధానం liberal గా చెయ్యలేము, లైసెన్సు కావలెనంటె ఇంతకుముందు నేరంచేసినాడని అనడం జరుగుతూవుంది ఈ విషయంలో పోలీసు వారిమీద ఆధారపడడం ex-tappers కు చాలా కష్టంగా వున్నది. ఈ లైసెన్సు విధానం సరిగాలేదని మనవిచేస్తూ వీరందరికీ లైసెన్సులు లిబరల్ గా ఇవ్వడానికి పూనుకొనవలెనని మనవి చేస్తున్నాను.

పోలీసు కానిస్టేబుల్స్ T A. విషయం ఆలోచిస్తామని మంత్రిగారు చెప్పారు తప్పకుండా త్వరగా T. A పెంచాలి. పుష్టిగా వుండి పనిచేయవలెనంటే

17th March 1956] [Sri S. Vemayya]

రెండు పూట్లు భోజనం వుండాలి. రోజుకు రూ 0-12-0 ఇచ్చి గ్రామాలకు పోయి కేసులు Detect చేయమని చెప్పడం ఏమిన్యాయం ? కనీసం రెండుసార్లయినా భోజనం చెయ్యవలెనంటే రూ 0-12-0 ఇవ్వడం సబబుగా లేదు. Daily Allowance కనీసం రూ 2-0-0 అయినా లేకపోతే ఎవరూ కూడా వుద్యోగం చెయ్యలేరు.

అందరికి తప్పకుండా రూ 2-0-0 తక్కువ లేకుండా D A. ఇవ్వడానికి ప్రభుత్వం పూనుకొనవలెను. అట్లా పూనుకొనకపోతే వారు ప్రజలమీద పడి పీడించుకొని తినేటటువంటి అవినీతికి దారి చూపించినవారవుతాము. Indirect గా మనము వారిని సక్రమంగా ఉద్యోగం చేయకుండా చేసినవారమవుతాము.

ఈ పోలీసు కానిస్టేబిల్స్‌ను, హెడ్ కానిస్టేబిల్స్‌ను, అనేకమందిని, S. I. లుగా ప్రమోట్ చేసినారు. వుద్యోగాలలో ఖాళీ లేకపోయినా కూడా విపరీతంగా recruit చేసినందువల్ల వీరిని తిరిగి de-promote చేయావలసి వస్తున్నది. లోగడ హెడ్ కానిస్టేబిల్స్‌ను ప్రమోట్ చేసి కొంత ట్రెయినింగ్ ఇచ్చి, act చెసిన తరువాత వారిని దించి వేయడం జరుగుతూ వున్నది. అటువంటప్పుడు direct recruitment ఆపివేసి, వారి అనుభవాన్ని పురస్కరించుకొని, వీరందరికి త్వరలో ప్రమోషన్ ఇవ్వాలని నేను మనవిచేస్తున్నాను.

ఇక్కడ Police Department కు కూడా నేను ఒకచిన్న సూచనఇస్తున్నాను. department ను మూడు విధాలుగా భాగించాలి. అందులో ఒకటి Investigation department వాళ్ళకు ఏలాంటి ఇతరసంబంధాలూ లేక నేరాల్ని పరిశోధించి నేరస్థులను పట్టుకోవాడానికి మాత్రమే వారిని ఉపయోగించాలి. తరువాత రెండవశాఖ వారు కోర్టుకుపోయిన కేసులను నడపాలి. మూడవది Law and order శాఖగా పెట్టి ఆ విధంగా విభజించినట్లయితే వారు సక్రమంగా తెలివితేటలతో investigation చేయగలుగుతారు. మరొక విషయం ఏమంటే ఈ Reserve Police ను తీసుకొచ్చి Local Police కు వేయడం జరిగితే వారికి అనేకమైన బాధలు కల్గుతాయి. Reserve Policeలో వున్నవాడు మామూలుగా case investgation చెయ్యాలంటే సాధ్యపడదు. అదే రీతిగా local Police వాండ్లను తీసుకొనిపోయి Reserve కు వేస్తే, వాళ్ళెగురలేరని, ఎగరడానికి అలవాటు పడ్డవారు కారని మంత్రిగారు చెప్పారు. అందుచేత ఈ మార్పులు సాధ్యమయినంతవరకు లేకుండా చేసినట్లయితే కేసులు detect చేయ్యడానికి బాగుంటుందని చెప్పుచున్నాను. తరువాత గెజెటెడ్ వుద్యోగస్థులలో చాలా తక్కువమంది హరిజనులున్నారు. అసలు promotions కనబడవు అనేకసారులు హరిజనులకు ప్రమోషన్‌లు గురించి నేను ప్రశ్నలు వేశాను. సాధ్యమైనంతవరకు హరిజనులను pomote చెయ్యాలని కోరుతూ. సెలవుతీసుకొంటున్నాను.

Sri E AYYAPU REDDI.— Mr. Speaker, Sir, I support all the three Demands, but I confine my remarks to the Administration of Justice and the problems that will be confronting in future with respect to that. This House passed a resolution that as soon as Visalandhra is formed the High Court must be located at Hyderabad The Advocates Association at Guntur

also passed a resolution unanimously that the High Court must be shifted to Hyderabad. For passing such a resolution we appreciated them and we admired them, and in the ordinary course we expected that the High Court will be situated at Hyderabad and that there will be only one High Court for the whole State of Visalandhra. But surprisingly enough there is some news now that we are going to have two High Courts and that this move is coming mainly from the people of Telangana. It is really surprising that the people for whose benefit we wanted the location of the High Court at Hyderabad should try to keep us far away from them There are absolutely no reasons why we must have two High Courts, one for Hyderabad and one for Andhra.

Mr SPEAKER – There cannot be two High Courts. There may be a Division Bench.

Sri E AYYAPU REDDI — That is another view In the first instance it seems they tried for two separate High Courts, and now, there is a move to have a Division Bench in Andhra and a High Court at Hyderabad I do not see any reason why there must be a Division Bench separately for Andhra and a High Court for Hyderabad In the whole of India there is only one State which is having a High Court and a Division Bench functioning elsewhere except at the seat of the High Court. That is the State of Utter Pradesh, whose population is nearly six crores and which is highly developed industrially Except the State of Utter Pradesh, so far as my information goes, there is no other State

Mr. SPEAKER :—Travancore-Cochin

Sri E AYYAPU REDDI — Except those States there are no other States having Division Benches elsewhere other than the seat where the High Court is situated The main reason seems to be this . If the High Court is situated at Hyderabad there will be severe competition in the Bar from the side of Andhra. I do not think we can have a Division Bench separately, only for the purpose of safeguarding the interest of a few legal practitioners now at the High Court at Hyderabad. There are no other justifiable grounds If at all there is any reason for asking for a Division Bench it is only on the ground

17th March 1956] [Sri E. Ayyapu Reddi]

that certain areas are far away from the seat of administration of justice, the highest forum of justice, and such reason can be adduced only by Visakhapatnam and Srikakulam people. But the people from those areas had not come forward asking for a separate Division Bench for them There is no other area or region which can legitimately claim for a Division Bench.

Mr SPEAKER .— You can discuss this matter when the States Re-organisation Bill comes up for discussion

Sri E AYYAPU REDDI .— Sri Kaleswara Rao just now stated that we may have to adopt some of the laws, especially with regard to land reforms of the Hyderabad State The present situation in the Hyderabad State so far as the Judiciary is concerned, I do admit, is entirely different from the situation of the courts of our areas. An expert committee probably has to be appointed to go into this question, to see to evolve a process whereby the integration of the Judiciary in the whole State can be accelerated as soon as possible.

This problem is also connected with the overcrowding of the Bar. A healthy and sound Bar is a pre-requisite for the proper administration of justice. As a matter of fact the Bar is always a corrective and where a Bar is very sound the Bench cannot be otherwise. Now, unfortunately we know overcrowding at the Bar has now become a vexed question, and that this overcrowding is accelerating at a very rapid pace. Now almost all the upper middle class and rich youths who are educated, and who could not find places either in the medical college or in the engineering college automotically go to the Law College and ultimately land themselves at the Bar They are coming into the profession not on account of any aptitude or liking, but because there is no other alternative for them, and so they are coming and overcrowding the Bar. This problem has to be faced by the Government especially in view of the fact that now, according to our information and estimate, only ten or fifteen per cent of the members of the Bar are fully employed and the rest are either unemployed or underemployed. This will be a serious loss to the State in the long run. We will be having a thousand or a thousand and five hundred double graduates wasting their time and wasting their precious know-

ledge and their talents Recently I requested the Minister for Hindu Religious Endowments also to allot more quota in the Hindu Religious Endowments Dept for the recruitment from the Bar. Now people are being educated at a great cost to Government and at a great cost to the individual If this overcrowding at the Bar is not properly tackled it will lead to unhealthy and ultimately very sad results. I suggest that so far as the tackling of this problem is concerned, the Government may evolve a policy of making these Advocates from associations or some other process by which this overcrowding can be easily tackled

I wish to place on record my appreciation of the subordinate judiciary and the fine manner in which it is discharging itself The process of disintegration of the Executive from the Judiciary has really yielded very good results, and the members of the Bar who have been recruited to the subordinate judiciary are discharging their functions very well While on this subject, I have to state also that so far as the sub-magistrates are concerned, they are over-worked Some of the courts will be functioning till 8 P M., at night They do not have a properly equipped staff I wish to request Government to supply each sub-magistrate's court with a shorthand typist at least. A shorthand-typist to a sub-magistrate is quite essential, because every day he is expected to dispose of nearly two thousand cases According to statistics available, in each month a sub-magistrate has to deal with as many as two thousand cases The recording and the recording of the statement of the accused itself takes a huge portion of the time of the sub-magistrates Besides this, they are expected to go and write judgments at night and pronounce them in open court In these circumstances, the sub-magistrates who are, as I said, expected to dispose of so many cases, cannot be reduced to the position of a drudgery clerk going on writing day-in and day-out. So if any officer requires a shorthand typist, it is the sub-magistrates and none other. That is my humble opinion.

Coming now to another subject, I wish to submit that the libraries which these sub-magistrates are equipped with are very poor; they are almost negligible, they do not have a digest,

17th March 1956] (Sri E. Ayyapu Reddi)

they do not have the latest decennial digest especially, and they do not have even the index of case law Even if we lawyers cite a decision which is fifty years old, the poor magistrates are not in a position to say they are over-ruled If these magistrates are supplied with index of case law, they will be in a position to say whether a decision cited has been overruled or not So I urge on the Government to take at least this step of supplying the sub-magistrates with digests and index of case law, so that they may be up to-date and in a position to discharge their duties (proporly)and satisfactorily.

I now turn to another subject I wish to submit that the functioning of the Prohibition Act, which according to me we have enacted at a very great, is not very satisfactory, on account of the fact that these sub-magistrates are over-worked For a proper execution of the Prohibition Act the co-operation of the judiciary is quite essential A sub-magistrate who is expected to dispose of two thousand cases cannot be expected to deal with these Prohibition cases at leisure Most often, I think, he will be reduced to the position of soliciting the counsel to make the accused admit guilt and letting him off with a small fine In order to reduce the number of contested cases this policy of letting off the accused in Prohibition cases with a small fine has been uniformly adopted by one and all of the magistrates, without an exception That is no secret; and I think Government also knows it To remedy this state of affairs I suggest separate courts, or rather special courts may be formed for the enforcement of this precious Act —— I call it precious Act, because it has cost us so much — and it is no use saying that additional courts will cost us more money. For when we have embarked on a principle, we must enforce it at any cost, and even if it costs us a few lakhs it does not matter After establishing special courts for the enforcement of the Prohibition Act, the Government may appoint special magistrates, or appoint honorary magistrates, who will discharge the functions of second class magistrates and dispose of Prohibition cases. We may even go to the necessity of even appointing honorary magistrates for dealing with Prohibition cases especially for every taluk. Then Prohibition can be strictly

enforced and it will be made a success in the course of at least the next four or five years

Sir, administration of justice has been considered to be the primary duty of a State As a matter of fact the enforcement of *Dharma* has been considered to be the first and foremost duty of a ruler We have got instances in history of Rama and Jehangir —— in whose times administration of justice was done by the State free But now, we have inherited the Western jurisprudence and the courts from the West also, and now, for administering justice the State is demanding fees. Recently we have passed the Court Fees Act, which has made administration of justice, at least, civil justice, a very costly affair. The State will be taking off nearly one-third of the property in dispute if the case goes thrice to the High Court, after passing through the usual procedure in the lower courts Here I would like to draw the attention of the Government to one important fact Even at the time of discussing the Court Fees Act, and even at the time when it was about to be passed into law, Mr. Basi Reddi suggested that where parties compromise before an issue is framed or before the trial comes up, at least half of the court fees must be refunded. I hope this salutary principle will be given effect to by the Government as soon as possible Thank you, Sir

Sri P. BASI REDDI.— Mr Speaker, Sir, I support the Demands moved by the Deputy Chief Minister and I take this opportunity to make a few suggestions to the Government for their kind consideration, regarding administration of justice. First, I propose to deal with the G. O. recently issued by the Government appointing the district magistrates as assistant sessions judges for the purpose of hearing appeals under Section 409 of the Criminal Procedure Code as amended by Act XXVI of 1955. The amending Act of 1955 takes away the appellate powers of the district magistrates as also that of the sub-divisional magistrates and vest them in sessions judges and additional sessions judges and assistant sessions judges. The intention of the amending Act is to give a higher forum for these appeals than the forum of a district magistrate. That intention is perfectly clear when the Act takes away the appe-

17th March 1956] (Sri P. Basi Reddi)

late powers of the district magistrates and vest them with the sessions judges. The G O. confers on these district magistrates powers that have been purposely taken away by the amending Act This, I submit, defeats the intention of the amending Act, Act XXVI of 1955 I think it is desirable that this G O. is replaced by a more appropriate G O which should be in conformity with the spirit of the amending Act

The Hon. Sri N SANJEEVA REDDI:— I may submit for the information of the Hon Member that we are going to withdraw that G O, and as I stated on the floor of the House we are taking steps to appoint additional district judges and I hope that satisfies my friend

Sri P. BASI REDDI — I am very glad that this G O is being replaced by a more appropriate G. O. and so I close this matter.

Next, I come to the conditions under which the subordinate judiciary is working in the State. The department of courts has already been a surplus department It has been giving Government annually a net income of about 18 lakhs, and now. as Mr. Ayyapu Reddi adverted to the new Act, the new Court Fees Act is expected to give an additional income of about 15 lakhs, so that the total net income from this department is of the order of about 33 lakhs. But it is very regretable to note that the subordinate judiciary which is acclaimed to be one of the best in the country (Sir, I may say for the information of the House that our subordinate judiciary is acclaimed to be one of the best in the country) has not been receiving proper attention from the Government Firstly, the separation scheme was launched quite a long time ago and yet it is to be completed It has been introduced only in eight districts so far and it has yet to be introduced in three more districts in our State, namely, Krishna, Guntur and East Godavari. Provision has been made in the budget for the current year for the extension of the scheme to East Godavari district But for reasons which are not explained by the Government the programme fixed for the district has been dropped. I suppose Government would

have valid reasons for dropping the programme fixed for the current year. But any reasons that may have been responsible for the dropping of the scheme would not convince us

The Hon Sri N SANJEEVA REDDI — My friend evidently has not heard my speech The scheme is not at all dropped I told the House that while we anticipated some saving by the separation of the Judiciary, it seems to involve some extra cost Therefore I said, we are examining why there is an additional expenditure So the scheme is not dropped, it is going to be extended, and we are only examining why this additional expenditure will be incurred when it was expected that we will save some money

Sri P BASI REDDI ,— Sir I have not been saying that the scheme is dropped What I have been submitting was that the programme fixed for the current year has been dropped

Mr. SPEAKER — Postponed.

Sri P. BASI REDDI — Yes, postponed. Of course the Deputy Chief Minister has been pleased to state just now that they are examining the financial implications of the scheme. I submit, Sir, that so far as the financial reasons are concerned, they ought not to be allowed to weigh with the Government in the extension of the scheme For the Government are already getting a very considerable income from this department, and therefore I submit Govertment ought not to allow these considerations weigh in the matter of the extension of the scheme.

Next I go to the other conditions which are rather undignified to our courts Of course some of those conditions have been referred to by Mr Ayyapu Reddi But I propose to refer to some other conditions, which I earnestly appeal to Government to remedy forthwith in the 'interests of the subordinate judiciary. First, there is, what is called, a disposal-mindedness prevailing among the subordinate judiciary nowadays. It is because their work is being judged by the number of disposals they bring about in a particular month. I submit that this test by which the work of the sub-magistrates is judged , should be abandoned, and a device should be evolved where by the work

ఎంతో డబ్బు ఖర్చు పెట్టుకొంటే ఏదైన న్యాయం జరుగుతుందేమో కాని బీదవాళ్ళకి మాత్రం ఏవిధమైనటువంటి న్యాయం జరగడంలేదు. ఇది చాలా విచారకరమైనవిషయం. ఒకప్పుడు Madras Governor గారు నాతో 'ఉరిశిక్ష అనేదానిని స్త్రీలలో మీరు తప్ప ఇంకెవ్వరు సమర్థించలేరు' అని అన్నారు. ఒకయింటి యజమానిని గాని పసిబిడ్డను గాని డబ్బు కొరకు చంపినట్లయితే యజమాని లేనందువల్ల ఆ కుటుంబం ఎంతబాధ పడుతుందో, పసి బిడ్డను చంపినట్లయితే తల్లి ఏవిధంగా కృశించి పోతుందో స్వయంగా ఊహించుకొనవలసిందే గాని చెప్పవలసింగికాదు. ఇంత దుఃఖము కలిగించిన వాడు ప్రపంచంలో ఇంకా ఎందుకు ఉన్నాడా అని కూడా అనిపిస్తుంది. దీనికి కూడా కొంతమంది C. I. D. లు జాగ్రత్తగా పనిచేసి, అక్రమంగా ఇటువంటి ఖూనీలు చేసిన వారిని శిక్షించకపోయినట్లయితే మనము ఉండేవాళ్ళమేకాము. Public Prosecutors కు జీతాలు ఉంటాయి వారింకా Private practice కూడా చేసుకోవచ్చు అయినా బీదవారి దగ్గర డబ్బుతీసుకొంటేనే గాని వారు కేసుల విషయంలో తగిన శ్రద్ధవహించడం లేదు. మనలోనే గనుక నీతిఉన్నట్లయితే అసలీ కోర్టులు పోలీసులు అక్కరలేదు. మనలో ఆ నీతే లోపించింది. ఇవన్నీ అవసరమౌతున్నాయి కాని చేయ దలచుకొన్నది మాత్రం శ్రద్ధగా చేయాలని నేను మనవి చేస్తున్నాను. Women Policeలు కావాలంటే చాలా మంది నవ్వుతారు తిరువాన్కూరులో Women Pclice లు ఉన్నారు నేనుకూడా చూచాను. Policeగా అన్ని dutyలతో Women Policeను పెట్టినట్లయితే అంతగా ఉపకరించరు గాని Vigilence work కు వారు ఉపకరిస్తారు Vigilence work కు గాని ఆడ ఖైదీలను search చేయడానికి గాని escort చేయడానికి గాని woman Police లు ఉన్నట్లయితే బాగుంటుందని నేను అనుకొంటున్నాను.

తరువాత, చాలాచోట్ల immoral traffic జరుగుతూ ఉన్నదని కాశీశ్వర రావుగారు చెప్పారు. దాన్ని తెలుగులో చెప్పాలంటే కొంచెము కటువుగా ఉంటుంది. Moral Hygiene కు గాను పెద్ద కమిటీవేశారు, చాల శ్రద్ధ తీసుకొంటున్నారు Central Government వారుకూడా. కాని మన రాష్ట్రంలో మాత్రం ఆ విషయంలో, ఇదివరకు శ్రద్ధతీసుకోలేదు. అందుకు నిజంగా విచారపడుతున్నాను. ఇది చాలా ముఖ్యమైనటువంటి విషయము. కొన్ని సందర్భాలలో స్వయంగా అది స్త్రీల యొక్క దుర్నీతేకాకపోవచ్చు. కొన్ని ఇబ్బందులవల్ల వారిని బలవంతపెట్టి ఈ విధంగా బాధపెడుతున్న సందర్భాలుకూడ ఉన్నాయని మనకందరికి తెలుసును. ఏమైనప్పటికిని ఈ దుర్నీతిని అరికట్టకపోతే మనము న్యాయముచేసిన వాళ్ళము కామేమో అనుకొంటాను. కనుక ఈ విషయమై తగు చర్య తీసుకోడానికి తలపెట్టాలి. ఇప్పుడు ఇది చేయడం అవసరమో కాదో తెలియదు. హైదరాబాదులో ఏమి work జరుగుతున్నదోకూడా నాకు తెలియదు. అందుచేత ఇది ముఖ్యంగా గమనించవలసిన విషయము.

ఇక, Certified School గురించి వేమయ్యగారు చెప్పారు. మనకు అటువంటిది లేనిదానివల్ల, బళ్ళారికి పంపవలసి వస్తున్నదని. అసలు అది చాలా సులభమైన విషయము. ఒక చిన్న certified school మనము స్థాపించుకొన్నట్లయితే, మన డబ్బు మన రాష్ట్రములోనే ఖర్చు అవుతుంది. పైగా బిడ్డలయొక్క బాగోగులను చూడవలసిన బాధ్యత మనపైఉన్నది వారే ఇకరాబోయే పౌరులు. వాళ్ళకు తెలివి తేటలులేక కాదు. అనేక కారణాలవల్ల, ఏదో తల్లి కష్టపెట్టడంవల్లనో లేక

తల్లిదండ్రులు లేక పోయినందువల్లనో, బీదతనంవల్లనో, వాళ్ళు ఆ విధంగా పెరుగుతూ ఉంటారు విధిలేక, [out of necessity] అటువంటి తప్పులు చేస్తూఉంటారు ఢిల్లీలో చూచాము అక్కడ బాలసహాయానికిగాను ఒక పెద్ద సంస్థ స్థాపించారు. అటువంటి బిడ్డలను తీసుకువచ్చి వాళ్ళకు తగిన చేతిపనులు నేర్పుతున్నారు. వారు చక్కని పనిచేస్తున్నారు. చక్కగా ప్రవర్తించు కొంటున్నారు. అలా మనము కూడా ఒకటి స్థాపించవలసిన అవసరం ఉన్నది అసలు మనకు Borstal School లేనేలేదు అనుకోండి. ఇవన్నికూడ reformatory గా ఆలోచించుకొని దిక్కులేని వాళ్ళను, చెడుదారి పట్టిన వాళ్ళను సరియైన మార్గంలో పెట్టే బాధ్యత మనపైన ఉన్నది.

తరువాత అప్పారావుగారు గ్రామాలలో fire accidents జాస్తిగా జరుగుతున్నాయి, వాటిని prevent చేసేందుకు ప్రభుత్వము ప్రయత్నించవలసిందని చెప్పారు. నిజమే కాని ఈ విషయంలో గవర్నమెంటు ఏ విధంగా help చేస్తుందో నాకు అర్థంకాకుండా ఉన్నది. ఒకవేళ ఎక్కడైనా fire stations ఏర్పాటు చేసినప్పటికినీ, telephone system లేదు కాబట్టి, చప్పున పిలపించేందుకు వీలుకాదు. కనుక ఎక్కడైనా నీళ్ళు stock పెట్టి దానికి బండో ఏదో ఏర్పాటుచేస్తే కొంత ఉపయోగంగా ఉంటుందేమో అనుకొంటాను. ప్రతిసంవత్సరం ఎన్నో గ్రామాలలో ఎన్నో ఇళ్ళు తగలబడి లక్షలు, వేలు రూపాయలు నష్టమై, అనేకమంది స్త్రీలు, బిడ్డలు అవస్థపడుతున్నారు. కనుక ఆ విషయంలో ఒక కమిటీ అయినావేసి ఈ సమస్యను ఏ విధంగా tackle చేయవచ్చునో ఆలోచించి, వాళ్ళకి ఏదో relief ఇచ్చేదానికోసం మనము కొంతడబ్బు ఖర్చుపెట్టినట్లైతే గ్రామాలకు మన duty చేసిన వాళ్ళమవుతాము.

పోలీసువాళ్ళకు ఇస్తున్న daily allowance విషయంలో, పోలీసు వాళ్ళేకాదు, ఇంకా అనేకమంది ఇతర Departments లో ఉన్న peons మొదలగువారు ఈ కొద్ది D A తో చాలా బాధపడుతున్నారు. మనము చూస్తున్నాము. Peons మనతో వస్తున్నారు. వారికి ఇచ్చే పండ్రెండు అణాలతో ఒక పూట భోజనముకూడరాదు. ఎవరివెంట వాళ్ళు పోతారో, వాళ్ళు వీరి తిండి విషయమై చూచుకొంటారో, చూచుకోరో! మనము వారిని ఒక duty కి వేస్తున్నప్పుడు, వాళ్ల స్థితిగతులు చూడకుండడం అన్యాయం ఆ విధంగా imagination లేకుండా వారికి ఇంత తక్కువ allowances continue చేస్తూ ఉన్నామన్నమాట. వాళ్ళకు కనీసం రోజుకు రెండు రూపాయలు ఖర్చుఅవుతుంది. అంత ఇవ్వవలసివస్తే చాలా ఎక్కువ మొత్తము అందుకు కేటాయించవలసి వస్తుందేమో. అంత మనం భరించలేము అనే భయము ఉంటుంది గాని, ఎట్లాగైనా వాళ్ళకు కొంత న్యాయము చేసినట్లైతే చాలాబాగుంటుంది.

Settlements లో కావలసిన పని జరగడంలేదు. దానికి ఏదో ఇంకా Salvation Army ద్వారాకూడా కొంత సహాయము తీసుకొంటున్నారు. Settlements చూచుకోడానికి ఊరికే పెద్దఖర్చు పెట్టుకొంటున్నాము. అక్కడ Police officers ఎక్కువ శ్రద్ధ తీసుకొన్నట్లయితే, దానివల్ల ఎక్కువ ఉపయోగముంటుంది. అక్కడ ఉన్న వారి బిడ్డలు చదువుకోడానికి వీలుంటుంది. వాళ్ళు వృద్ధికి రావడానికి వీలుంటుంది. ఆ reformation వాళ్లలో తీసుకు రావాలంటే, వారికి ఎక్కువ శ్రద్ధతో విద్యనిచ్చి వారికి వృత్తులు నేర్పించి వారి దృక్పథమే మారేలాగున చేయాలి.

17th March 1956] (Srimathi C Ammanna Raja)

తరువాత, beggar problem ఇందులోనికి వస్తుందో రాదో నాకు తెలియదు. ఏమయినా, ఇప్పుడు తప్పుచేసిన పిల్లలకు Borstal schools, Certified schools ఏ విధంగా పెడుతున్నామో, అదేవిధంగా ఈ beggars కు కూడ ఒక Home లాగ ఏర్పాటుచేసి, వారిని అక్కడికి తీసుకువచ్చి, వారికి విద్య, వృత్తి నేర్పిస్తే బాగుంటుంది. నిజంగా ఇప్పుడు వారు ఎలా బ్రతుకు తున్నారో, ఎవరు వారికి తిండి పెడతారో నాకు తెలియడంలేదు. కొంతమంది పగలు బిక్షానికి వచ్చి రాత్రులు దొంగతనానికి వస్తారని అంటారు కానివీరికి ఆ విధంగా ఏర్పాటుచేసినట్లైతే, ఇటువంటి దొంగతనాలు మొదలైనవి రూపుమాపి నట్లవుతుంది. అదికూడ మనబాధ్యతే. Welfare Society కావాలి. ఎవరికికూడ wants ఉండకూడదు. అందరు సుఖముగా ఉండాలి అన్నట్లయితే beggars ను వీధులలో రాకుండా చేయాలి. రాకుండాచేస్తే ఏమవుతారు? కాబట్టి వారికి ఒక Home స్థాపించడం చాలా అవసరమవి తెలియజేస్తూ సెలవు తీసుకొంటున్నాను.

* Sri M NAGIREDDI — అధ్యక్షా, కోర్టులు, జైళ్ళు, పోలీసు ఈ మూడు డిమాండ్లు ఒకేసారి పెట్టారు. కోర్టుల విషయంలో కోర్టులలో ఒక భాగంగానే పంచాయితీకోర్టులుకూడ ఉంటున్నాయి. ఇదివరకు పంచాయితీకోర్టులు విడిగాఉండేవి. 1950 లో Village Panchayat Act, అమలు జరిపి, పంచాయితీబోర్డులు వచ్చిన తరువాత, ఈ కోర్టులనుగూడ వాటిలో inlcude చేశారు. నూరు రూపాయలవరకు ఉన్న civil దావాలు మాత్రమే ఈ పంచాయితీ కోర్టులు తీసుకొనేందుకు అధికారము ఇచ్చారు. వాది ప్రతివాదులు అంగీకరించినట్లయితే రెండువందల రూపాయలవరకు తీసుకోవచ్చునని పెట్టారు ఇది ఎట్లా సంభవమో తెలియడంలేదు. వాది ప్రతివాదులు అంగీకరిస్తే అంటే ఇద్దరు కలిసి ఈకోర్టు రెండువందల రూపాయల దావా తీసుకోవచ్చు నని వ్రాసిస్తే ఆవిధంగా తీసుకోవచ్చునన్నమాట. ఇది ఆచరణలో ఉపయోగము లేకుండా పోతుంది. కనుక ఒకవైపున, ఖర్చులు తగ్గించాలి. ప్రజలు దూరప్రాంతాలకు వెళ్ళి civil court లో దావా పెట్టాలి అనే దానికన్నా, ఈపంచాయితీ కోర్టులే రెండు వందల రూపాయలవరకు తీసుకోవచ్చునంటే సరిపోతుంది. అంతేగాని వాళ్లు, వీళ్లు అంగీకరిస్తే తీసుకోవచ్చుననేటటువంటిది మాత్రము ఆచరణలో ఉపయోగకరంగా ఉండదు. కాబట్టి ప్రభుత్వము దీనిని పరిశీలించి ఆ condition తీసివేయడం మంచిద నేను ప్రభుత్వదృష్టికి తెస్తున్నాను

తరువాత ఇప్పుడు District Munsiff Courts summons జారీచేయటంలో చాలామట్టుకువాటిని Registred Post ద్వారానే పంపబడుతున్నాయి. కాని పంచాయితీ కోర్టులకు వచ్చేటప్పటికి ఇతర గ్రామాలకు summons జారీచేయాలంటె, అవి District Munsiff's Court కు పోవాలి. ఆ కోర్టువాళ్ళు దాన్ని serve చేయాలి. మళ్ళీ ఆ summons వీళ్ళకు return కావాలి. ఇదంతా జరిగేటప్పటికి చాలాఆలస్యమవుతుంది. District Munsiff's Court వాళ్ళు వారి summons వారే జారీచేసుకోలేక Regd Post ద్వారా పంపుతూఉంటె, పంచాయితీ కోర్టు summons కూడ వారికి పంపడం అంటె, అది ఆచరణలో జరుగదు. పైగా చాలా అలస్యమవుతుంది. కాబట్టి, పంచాయితీ కోర్టులుకూడా summons ను Regd Post ద్వారా direct గా పంపించేటటువంటి అధికారాన్ని వారికి కల్పించాల కోరుతున్నాను.

District Munsiff s Courts లో అనేక కేసులు సంవత్సరముల తరబడి pending లో ఉంటున్నవి. మా గురుజాల District Munsiff's Court లో 5, 6 ఏళ్ళనుంచి కూడా pending లో ఉన్నటువంటి కేసులు ఉంటున్నాయి. దీనివల్ల వాదులుగాని ప్రతివాదులుగాని చాలా ఇబ్బందులకు గురి అవుతున్నారు. అవి త్వరగా dispose off కావడానికి సరియైనటువంటి చర్యలు తీసుకోవలసిన అవసరమున్నది. ఇక, Stamp Duty fee పెంచినపుడు, ఎక్కువగా discussions జరిగాయి. ముఖ్యంగా writ petitions విషయంలో fees పెంచడంవల్ల, మామూలుగా మన ప్రాథమిక హక్కులను కాపాడుకొనేందుకు వేసేటటువంటి వాటికి కూడ, అవి వేయలేకుండా, అంతరాయము కలుగుతూ ఉండడమనేది ముఖ్యంగా క్రింది తరగతివాళ్ళకు కష్టమౌతూంది. కనుక ప్రభుత్వము దానిని తగ్గించేందుకు ప్రయత్నించవలెనని, ఈ విషయము వారిదృష్టికి తెస్తున్నాను.

తరువాత jails విషయం చూచినపుడు, ముఖ్యంగా ఈ sub jails లో చాలా ఇరుకుగా వుండడము? అనేటటువంటిది, ఖైదీలు చాలా ఇబ్బందులకు గురి కావడమనేటటువంటిది, అక్కడ rations supply చేయడానికి contractors ను పెడితే వారు ఆ rations ను సరిగా ఇవ్వకపోవడ మనేటటువంటిది ఈవేళ అక్కడ కనబడుతుంది. వాళ్ళకు ఇవ్వవలసిన సబ్బు, నూనె కూడా ఇవ్వక పోవడం, కనీసం రోజుకు ఒక తూరి స్నానానికైనా కడలక పోవడం ఇటువంటి పరిస్థితులు sub jails లో ఉంటున్నాయి అందువల్ల వీటిని గురించి ప్రభుత్వం గట్టిగా instructions ఇచ్చి వాళ్ళకు ఇచ్చేటటువంటి ration సరిగా ఇప్పించాలని కోరుతున్నాను. తరువాత మామూలుగా sub jails లో ఉన్నటువంటివారు కొంతమంది అక్కడ ఇచ్చే rations సరిపోక పోలీసు వాళ్ళకు ఏదో డబ్బు ఇచ్చి private గా అన్నము తెప్పించు కొంటారు. కాని ఇక్కడ జరుగుతున్నది ఏమిటంటే వాళ్ళకు ఇచ్చే rations సరిగా ఇవ్వడంలేదు సరికదా వారు private గా తెప్పించుకొనే అవకాశం కూడా లేకుండా పోతున్నది. ఇతర సభ్యులుకూడా ఈ విషయాన్ని సూచించారు. ఒకవేళ ప్రభుత్వ దృష్టిలో private గా అన్నము తెప్పించుకొంటే దానిలో ఏదైనా విషముగాని మరేదైనా గాని ఉంటుందేమోనని ఆ కారణంచేత ఇవ్వటానిని వీలుతేదంటే ఎవరైనాసరే private గా ఎవరికైనా అన్నము తెచ్చేటప్పుడు ఆ తెచ్చేవారియొక్క పూచీపైన వారి బాధ్యతపైన ఆ భోజనము supply చేసుకొనే అవకాశం కల్పించవచ్చు. ఆ విధంగా చేసినట్లయితే ఆ ఇచ్చే ration మిగిలి పోవడం వల్ల ప్రభుత్వానికి కూడా ఆదాయము వచ్చినట్లు అవుతుంది రెండవది ఖైదీలకు కూడ అనుకూలంగా ఉంటుంది.

తరువాత ఖైదీలకు వైద్యసౌకర్యాల విషయంలో, ఏదో serious cases ఉంటే తప్ప డాక్టరు visit చేయడం లేదు. డాక్టరు ప్రతిరోజు visit చేయాలని ఉన్నప్పటికి కూడా ఆ విధంగా రావడం గాని వారికి సరియైన వైద్య సౌకర్యాలు ఇవ్వడం గాని లేదు, పోని patients ను hospitals కు తీసుకొని పోయే అవకాశాలు ఉన్నాయా అంటే అది కూడా లేకుండా పోతోంది.

అందువల్ల సబ్ జైళ్ళలో పరిస్థితులు ఈ విధముగా ఉన్నవి. ఈ సబ్ జైళ్ళు ఉదయము ఆరు గంటలకు తెరుస్తారు. మరల సాయంత్రము తెరుస్తారు. పగలు, రాత్రి

17th March 1956] (Sri M. Nagi Reddi)

అంతా మూసే ఉంటారు. ఈమధ్య ఎప్పుడూ కూడ తెరచేదే లేదు. జైళ్ళలో ఉండే prisonersయీ మధ్యకాలములో బైటకు వెళ్ళాలని అంటే, వీలుకాని పరిస్థితులు ఉన్నవి. అసలు యీ జైళ్ళు అన్నీ over-crowded గా ఉంటున్నవి అనే సంగతి మనకందరికీ తెలుసు, మంత్రిగారికి కూడా తెలుసు. కాబట్టి పగటి కాలములో కొంతసేపు ఉదయము, సాయంత్రము మధ్యగూడ తెరువటానికి అవకాశములు కల్పించాలని మంత్రి గారిని కోరుతున్నాను. ఇక పోతే సెంట్రల్ జైళ్ళు ఎట్లా ఉండేదన్నీ అనుభవములో మేము చూచే ఉన్నాము. డి. క్లాసు ఖైదీలకు, యితర ఖైదీలకు యిచ్చే శిక్షలు, వారికి యిచ్చే ration ఎంతో గూడ అందరికి తెలుసును. వారి అందరికీ యిచ్చే రేషన్ పేరుకు ఉన్నదానిలోనే కొంత భాగము జైలర్సుకు, డిప్యూటీ జైలర్సుకు, వార్డన్సుకు, సూపరింటెండెంట్సుకు వీరి అందరికీ కూడ చేరడము అనేది జరుగుతున్నది. కొంతమంది డబ్బు ఉన్నవాళ్ళు ఉంటే వారికి బైటనుంచే వస్తున్నది. ఇకపోతే వాళ్ళకు గాను నిర్ణయించబడిన అన్నపు ముద్దలు బైట అమ్మడం కూడ తెలుసు. ఈ విషయాలన్నీ మంత్రిగారు కూడ వారు జాతీయోద్యమములో పాల్గొన్నప్పుడు, సి. క్లాసు ప్రిజనరుగా ఏవిధంగా అనుభవించిందన్నీ గూడవారికే తెలుసుననుకొంటాను కాబట్టి యిటువంటి అవినీతిని అరికట్టించటానికి మంత్రిగారు ప్రయత్నించవలసి యున్నది. ఇప్పుడు ఏదో సంస్కరణలు తేవాలని ప్రభుత్వముఅనుకుంటున్నది ఈ సంస్కరణలు యీ జైలు జీవితము అనుభవించేవారు మరల వారు తిరిగి వెళ్ళేసరికి మంచి పౌరులుగా మారాలి అనే ఉద్దేశ్యము ప్రభుత్వానికి నిజముగా ఉంటే, వారికి జైలు సంస్కరణలు తగినరీతిగా ఏర్పాటుచేయాలని మంత్రి గారి దృష్టికి తెస్తున్నాను.

తరువాత మన రాష్ట్రములోని పోలీసులను యితర రాష్ట్రములకు సహాయము చేయటానికి గూడ అవకాశములు ఏర్పడ్డాయని మంత్రిగారు చెప్పారు. ఇది బాగానే ఉన్నది. సంతోషము ఇక్కడ మనకు శాంతి పరిస్థితులు ఉన్నవి గనుక యితర రాష్ట్రములకు పంపుతున్నామని అన్నారు. అయితే మన రాష్ట్రములో పోలీసులు అవసరము అంతగా కనపడనప్పుడు, యిక యీ పోలీసు డిమాండుమీద డబ్బు పెంచడము ఎందుకో అర్థముకాలేదు దానికి కారణము ఏమిటి అని అడిగితే గుంటూరులాంటి పట్టణములలో అవసరము వచ్చిందని, యింకా అక్కడ ఎక్కువగా Police Stations పెట్టవలసివచ్చిందని సమాధానము చెప్పారు. కాబట్టి ఎప్పటికప్పుడు ఏదో సాకుచూపించి, యీ పోలీసులను పెంచడము, డిమాండు పెరగడము జరుగుతునేఉన్నది. ఒకవైపున శాంతి పరిస్థితులు ఉన్నవి, యిక్కడ పనిలేక యితరరాష్ట్రములలో అత్యవసరపరిస్థితులు ఉంటే అక్కడికి మనపోలీసులను ఉపయోగించటానికి పంపుతున్నామని చెబుతూ మరొకవైపున యిక్కడ అత్యావసర పరిస్థితులు వచ్చినప్పుడు, ఇతర దేశములలో మాదిరి యుద్ధపురోజులు వస్తే, లేక మనకుయిక్కడ National reconstruction కొరకు, ప్రజలకు ఉపయోగము కొరకు వారిని ఉపయోగించడము యీవిధంగా అన్నిరకాలవారిని ఉపయోగిస్తున్నారు. వారు ఆ విధముగా దేశానికి ఉపయోగ పడుతున్నారు. సరే, కాని వారికి Dearness allowance, Daily allowance increase చేయమని కోరితే మాత్రము, డబ్బు లేదని ప్రభుత్వము చెప్పడము, ప్రభుత్వమునకు యింకొక రూపములో ఖర్చు ఎక్కువగా చూపించడము కన్పిసున్నది. ప్రభుత్వం యీ విధముగా వారికి allowances increase చేయటానికి సంశయించడము ఎంతటి న్యాయమని

అడుగుతున్నాను. ఈ విధముగా పోలీసులను నిరుత్సాహపరిస్తే ప్రభుత్వము మన దేశాన్ని ఎట్లా ముందుకు తీసుకుని పోగలదు? ఈ రోజున ఒక్కొక్క పోలీసుకు బైటఊరుకు వెళ్ళితే రు. 0-12-0 లు దినభత్యముక్రింద యిస్తున్నారు. ఈ విషయమే యింకా సభ్యులు చాలా మంది చెప్పారు. మంత్రిగారు యీ విషయము బాగా గుర్తిస్తారనుకుంటాను. వారికి యిచ్చే యీ పన్నెండు అణాలలో రెండుపూటల భోజనమునకు ఎంత అవుతుంది. అతనికి యీ నాటి అలవాటులనుబట్టి కాఫీ ఖర్చుకు ఏమి కావలసి ఉంటుంది, ఇది అంతా యీ పన్నెండు అణాలలో నివసించగలడా అని అడుగుతున్నాను. కాబట్టి వారు యితరత్రా సంపాదించుకోకపోతే, యీ పన్నెండు అణాలలో నివసించలేడు అని మంత్రిగారు ఒప్పుకోక తప్పదు. అందుకనే ఏ పోలీసు అయినను బైటగ్రామమునకు వెళ్ళినప్పుడు, ఎవరినో పట్టుకొని, ఏ బండికేసు పెట్టుతాననో, యిదుగో జాలరు నీళ్ళు బైటకి వస్తున్నవి గనుక, నీమీద యీ కేసు పెట్టుతానని చెప్పడమో, లేకపోతే యింకొక విధముగానో ఎవరినో ఒకరిని పట్టుకుని బెదిరించి పావలాడబ్బులు తెచ్చుకోకపోతే, ప్రభుత్వముయిచ్చే యీ పన్నెండు అణాలలో అతను పొట్టపోసుకుని డ్యూటీ సక్రమంగా చేయగలడనే ప్రభుత్వము విశ్వశిస్తున్నదా అని అడుగుతున్నాను. ప్రభుత్వము న్యాయము విచారించి, అతనికి సరిపోయే దినభత్యము, యీ నాటి ఖరీదులనుబట్టి, యిస్తేగదా, అతను యింకొక అక్రమకార్యానికి దిగకుండా ఉండగలడు? సంజీవరెడ్డిగారు యీ విషయాలన్నీయు బైటకు ఒప్పుకోకపోయినా, తన మనస్సులోనైనా నిజానిజములు గ్రహించి నేను చెప్పిన సంగతులను ఒప్పుకుని తీరుతారని నా విశ్వాసము కాబట్టి పోలీసుకు తగినంత దినభత్యము యివ్వకపోతే యిటువంటి అవినీతి పనులు అరికట్టడము సాధ్యముకాదు అని ప్రభుత్వము ఒప్పుకొనితీరాలి. అందువల్ల పోలీసులకు దినభత్యము పెంచమని కోరినప్పుడు డబ్బులేదని సాకు చెప్పడము న్యాయముకాదు. ఆ డబ్బు మరల ప్రజలమీదనే యింకొక విధముగా పడుతున్నదని ప్రభుత్వము గుర్తించి వారికి దిన భత్యము హెచ్చింపు చేస్తుందని ఆశిస్తున్నాను. ప్రభుత్వము డబ్బులేదని చెప్పడం సరియైన పద్ధతికాదు. న్యాయముకాదు కూడా.

ఇది కాక పోలీసు డిపార్టుమెంటులో documentary films లో "మీ సేవకుడు" అనే దాన్ని తీసుకొనివచ్చి చూపిస్తున్నారు. బాగానే ఉన్నది. అయితే యీ film చూపించడము వల్ల యిందులోని అంతరార్థము ప్రజలు గుర్తించటానికి, పోలీసు ప్రజల సేవకుడుగా భావించడము జరగాలని చూపిస్తున్నారు నిజానికి యీ విధముగా జరగడములేదు. పోలీసుకు డబ్బులేని సమయము వస్తే "మీ సేవకుడో" లేక "మీ భక్షకుడో" యిందులో ఏది అవుతాడు అనేది చూడాలి. డబ్బులేనప్పుడు ప్రజల సేవకుడుగా ప్రవర్తిస్తున్నాడో, లేకపోతే ప్రజలమీద పడి భక్షిస్తున్నాడో ప్రభుత్వము గుర్తించిందా? ఈ రోజులలో ప్రజలకు ఉపయోగముగా ఉండేటట్లు పోలీసులను చేయాలంటే, యిదుగో! యీ పోలీసు కేసులు పెట్టి ప్రజలను బాధపెట్టాడు కాబట్టి అతనిమీద ప్రభుత్వము చర్యతీసుకున్నది అనేది ప్రజలు గుర్తించేటట్లుగా film చూపిస్తే అప్పుడు ప్రజలు గుర్తించగలుగుతారు. అంతే కాని, యిప్పుడు ప్రభుత్వము చూపించే documentary films ప్రజలు చూస్తే "మీ సేవకుడు" అని గ్రహించే బదులు, "మీ భక్షకుడు" అని అర్థము చేసుకుంటున్నారు. పోలీసులను చూస్తే, సేవకులుగా చూడడములేదు. రాక్షసులుగా చూస్తున్నారని మనవిచేస్తున్నాను. కాబట్టి పోలీసుకు

17th March 1955] (Sri M Nagi Reddi)

డబ్బులేనప్పుడు ఆ డబ్బుకోసము ప్రజలమీద ఏదోవిధముగా వాళ్ళను బాధించి, భక్షించి వచ్చేబదులు వాళ్ళకు కావలసిన జీత భత్యములు ఎక్కువచేస్తే, ఈలాంటి భక్షించే పరిస్థితులు ఏర్పడవు. ప్రజలుకూడ సంతోషిస్తారు. అప్పుడురాక్షసులు పోయినారనే దృష్టి ప్రజలలో కలుగుతుంది. కాబట్టి ప్రభుత్వము పోలీసులకు జీత భత్యములు పెంచటానికి ప్రయత్నించవలసి ఉన్నది. సంజీవరెడ్డిగారిని యీ విషయము పునరాలోచించవలసిందిగా కోరుతున్నాను.

ఇకపోతే యిప్పుడు మన ఎసెంబ్లీకిఎక్కువమంది రిపోర్టర్లు ఉన్నారు. అందుకుగాను పోలీసు రిపోర్టర్లను పిలిపిస్తున్నారు. ఇక్కడ రిపోర్టర్లకు నెలకు రెండు వందలు యిస్తున్నారు. కాని పోలీసు రిపోర్టర్లు గూడ యిక్కడ రిపోర్టర్లు చేసేపనికే పిలిపిస్తున్నారు, చేస్తున్నారు కూడా. కాని వారికి యిచ్చే జీతము ఎంత ? అంతా 80 రూపాయలు దినభత్యము చూస్తే రెండు రూపాయల పావలా పైగావారు యిది వరకు ఎక్కడకు పోయినా Police Clubs లో వుండేవారు. అక్కడ అన్ని సౌకర్యాలు ఉండేవట ఇక్కడ వారికి ఒక tent ఇచ్చి అందులో నలుగురు ఉండమని ఆదేశిస్తూన్నారట. ఇక్కడ రిపోర్టర్లు చేసే పనియే యీ పోలీసు రిపోర్టర్లు చేస్తున్నప్పుడు ఇక్కడ ఉంటున్న వారితోబాటు అయినా వారికి remuneration గాని దిన భత్యము ఎక్కువ చేసిగాని ఉండలేదు. ప్రతి సారీ యిక్కడికి వారిని పిలిపించి యిబ్బంది పెట్టుతూ వారిచేత అక్కడ పోలీసు డిపార్టుమెంటులో వారు చేసేపని గాక యిక్కడ పనియిచ్చి యీ double work చేయించే బదులు వారిని యిక్కడనే absorb అయినా చేసుకోవాలి. లేకపోతే వారు యిక్కడ ఉన్న రోజులలో వారికి T A. అయినా ఎక్కువ వేయాలి. అది గూడ వీలులేకపోతే వారికి తగిన విధముగా Compensate అయినా చేయాలి, అని నేను మంత్రిగారి దృష్టికి తెస్తున్నాను.

ఇదే విధముగా Pohibition Department విషయము చూడండి నేను యిదివరకు యీ విషయము ప్రభుత్వదృష్టికి గూడ తీసుకుని వచ్చాను. ఈ Prohibition విషయములో నా స్వానుభవమును గురించి ఒక ఉదహారణ చెబుతున్నాను. మా తాలూకాలో దాచేపల్లి పోలీసుస్టేషను ఉన్నది. అక్కడ Sub-Inspector సహాయముతో స్టేషనుకు ఎదురుగానే సారాయి బట్టీలు పెట్టి కాయించి తీసుకొనివచ్చి, స్టేషనుకు ఎదురుగా పెట్టి పబ్లికుగా అమ్ముతున్నారు. ప్రభుత్వానికి యిదినిజముగా ఋజువు చేయాలంటే, ఎవరినైనా C I D ని వేయండి. ఇదినిజము అవునోకాదో తెలుస్తుంది తరువాత యీ విషయము నా నోటీసుకు రాగానే, యిది ఏమిటి, యీ విషయము నేను ప్రభుత్వానికి రిపోర్టు చేస్తాను అని అంటే, నామీద గూడ నేను ఎవరినో కొట్టానని, Sub Inspector అక్రమ కేసుపెట్టాడు. చివరకి అది మేజస్ట్రేటువద్ద విచారణ జరిగితే, అదికట్టి దేనని ఋజువు అయింది కేసు కొట్టివేయడము అయింది. ఇదే మాదిరిగా కొట్రపాడు, రామాపురము పంచాయితీ ప్రెసిడెంట్లమీద యీ Sub-inspector రెండు కేసులు పెట్టాడు. ఒక కేసులో హాజరు అవుతున్నాడు. రెండవ కేసులో సమన్సు జారీ చేయటానికి abscond అయినాడని వారంటు పంపించాడు. చివరకి మేజస్ట్రేటు, యిది యేమిటయ్యా, ఆయన కేసులలో హాజరవుతూంటే, వారంటు ఎందుకు పంపించావు అని అడిగితే, సమాధానము చెప్పలేక పోయినాడు. కాబట్టి పోలీసువారు Prohibition కేసులు వాళ్ళ regular Police కేసులు, యీ విధముగా చేస్తున్నారు అనే సంగతి

మంత్రిగారి దృష్టికి తెస్తున్నాను. తరువాత యింకొక విషయము చెబుతాను. కరాలపాడు నుంచి ఎరుకలవాళ్ళు వచ్చారని అక్రమముగా రాత్రి 9 గంటల వేళప్పుడు కనపడితే, వాళ్ళను Sub-Inspector అరెస్టు చేశాడు. అది గస్తీసమయంకూడ కాదు. I P C 51 వ సెక్షను క్రిందనో, మరె సెక్షను క్రిందనో వాళ్ళను arrest చేశాడు. రాత్రి తొమ్మిది గంటలకే అక్రమముగా అరెస్టు చేశాడు అని మేము D S P కి Collector కు, వాళ్ళకు టెలిగ్రాము యిస్తే, రాత్రి పదకొండు గంటలకు గస్తీ సమయములో దొరికారని అరెస్టు చేసినట్లు తప్పుడు డైరీవ్రాసి, రిపోర్టు పంపించి కేసుపెట్టాడు. ఇది ఎంత అక్రమమో మంత్రిగారు గుర్తించాలి. కాబట్టి వాస్తవ పరిస్థితులు పోలీసు డిపార్టుమెంటులో ఉండేవి మంత్రిగారి దృష్టికి తెస్తున్నాను. ఇటువంటి అక్రమాలు జరగకుండా మంత్రిగారు తగుచర్య తీసుకుంటారని ఆశిస్తునాను.

Sri S JAGANNADHAM — అధ్యక్షా, ఉపముఖ్యమంత్రిగారు ప్రతిపాదించిన యీ డిమాండును నేను బలపరుస్తూ కొన్నిసూచనలు ప్రభుత్వానికి చేయదలచాను. మంత్రిగారు డిమాండును ప్రతిపాదిస్తూ judiciary నుంచి executive separation ను యిప్పటికి ఎనిమిది జిల్లాలలో introduce చేశాము కాని యిప్పటికి రెండులక్షలదాకా అదనపుఖర్చు అవుతున్నదికాబట్టి, మిగిలినజిల్లాలలో introduce చేయడము ప్రస్తుతానికి postpone చేశామని చెప్పారు. అయితే యిప్పటికి రెండు లక్షలు అదనపుఖర్చు కనబడుతున్నట్లయితే, యీ separation అనేది యింతటితో ప్రభుత్వము మానివేయ దలచుకున్నదా ? లేకపోతే రెండులక్షలు ఖర్చు అవుతున్నప్పటికినీ, మిగతా జిల్లాలలోగూడ introduce చేస్తాము అనే విషయమును గురించి ఒక్కమాటగూడ మంత్రిగారు చెప్పలేదు. కాని మిగతా జిల్లాలలో గూడ ఎందుకు introduce చేయకూడదు ? అప్పటికి అన్నిజిల్లాలలో కూడ introduce చేసినట్లు అవుతుందిగదా ? ఈ separation వల్ల ఎంతోమందికి ఉద్యోగాలు లభించగలవు. కాని 58 మందిని District munsiff's గా select చేసి, అందులో 12 మందికి ఉద్యోగాలు యిచ్చారు. తక్కినవారికి యింకా యివ్వలేదు. పోతే Sub-Magistrates గా చాలామందిని select చేశారుగాని, కొద్దిమందికే ఉద్యోగాలు యిచ్చారు ఇందులో కొంతమంది రెండు మూడు సంవత్సరాలుగా ఉద్యోగాలు చేస్తున్నప్పటికినీ, కొంతమందిని oust చేశారు. Recruitment విషయము ఇలాగు ఉండగా, ఇక వీరి training విషయము చెబుతాను. District Munsiff కు ఆరుమాసాలు, Sub-Magistrates కు తొమ్మిది మాసాలు training యిస్తామని అంటున్నారు. కాని Sub-Magistrates కు training కు పోయివచ్చినవారు, వారి అనుభవమును బట్టి, యీ training peiod ను రెండు మాసములు తగ్గించవచ్చని అంటున్నారు. ఇందులో మరొక విషయము ఉన్నది. District Munsff's కు starting 300 రూపాయలవరకు యిస్తున్నారు. కాని Sub-Magistrates కు మాత్రము నూరు రూపాయలే అని అంటున్నారు. వీరి యిద్దరికి ఒకే qualifications ఉంటున్నవి. పైగా యింత పెద్ద వ్యత్యాసము ఉండడము న్యాయముకాదు. District Munsiffs కు 300 రూపాయలు యిస్తూ యీ మేజస్ట్రేట్లుకు నూరు రూపాయలే యివ్వడము, బహుశ వీరు చేసుకున్న పాపము కాబోలు. ఈ విధంగా వ్యత్యాసము ఉండడమునకు కారణము తెలియలేదు. తరువాత

17th March 1956] [Sri S. Jagannadham]

District Munsiffs కు Dearness Allowance వేరే యిస్తున్నారు. కాని Sub-Magistrates కు అలాగు యివ్వడములేదు. పైగా Sub-Magistrates కు యింత కొద్ది జీతము యిస్తూ, 9 మాసముల training ఏమిటి? ఇందులో ఏ రెండు మూడు మాసములో తగ్గించ వచ్చని అంటున్నారు. ప్రభుత్వము యీ విషయము పరిశీలిస్తుందని నా అభిప్రాయము. నా ఉద్దేశ్యము Sub-Magistrates కు అటుజీతం తక్కువయిస్తూ, Dearness allowance అనేది గూడలేదు. పైగా training period 9 మాసములు. ఇది చాలా అన్యాయమని అంటున్నాను. ఇంతలో మార్పురావాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. ఇదిగాక Sub Magistrates యిచ్చే Judgments మీద revision petition కు jurisdiction District Court కు యిచ్చారు. కాని కొన్ని కొన్ని జిల్లాలకు ఒకే జిల్లా కోర్టు ఉంటున్నది. అప్పుడు revision petition ను దాఖలు చేయటానికి చాలా కష్ట తరమవుతున్నది. మంత్రిగారు యీ విషయము ఆలోచించాల్సి ఉంటుంది. అందువల్ల రెండు జిల్లాలకు ఒక District Judge ఉన్నప్పుడు, ఏ జిల్లాకు ఆ జిల్లా కలెక్టరు ఎలాగో ఉంటున్నాడు కాబట్టి P. C. ని suitable గా amend చేస్తూ, యీ revision petition కు మాత్రము District Magistrates కు jurisdiction ఉండేటట్లుగా సవరిస్తే బాగా ఉంటుంది. Convenient గా కూడా ఉంటుందని మనవి చేస్తున్నాను.

ఇప్పటికికూడా శ్రీకాకుళం జిల్లా, విశాఖపట్నం జిల్లాకు ఒకే District Court ఉన్నది Tribunal Court లో ముగ్గురు మెంబర్లను తీసేసి ఒకరినే single Judge ని నియమించడానికి బిల్లును pass చేశాము. Additional District and Sessions Judges నియామకం చేస్తున్నామని ఉపముఖ్యమంత్రిగారు చెప్పారు. అందుచేత నేను మనవిచేసేది ఏమిటంటే ఒకరినే Tribunal కు single member Judge గానూ, Additional District Judge గానూ కూడా శ్రీకాకుళంలో నియమించినట్లయితే బాగుంటుందని ఉపముఖ్యమంత్రిగారి దృష్టికి తీసుకువస్తున్నాను. Police వారు శాంతి భద్రతలు బాగా కాపాడుతున్నారని ఉపముఖ్యమంత్రిగారు చెప్పిఉన్నారు. శాంతి భద్రతలు కాపాడితే కాపాడవచ్చునుగాని, పోలీసువారి విధానాలుమాత్రం చాలా అన్యాయంగా ఉన్నవని మనవిచేస్తున్నాను. పెద్దపెద్ద ధనవంతులకూ, పెద్దవాళ్ళు అనిపించుకునేవాళ్ళకే ఈ Police వారు సహాయం చేస్తున్నారు గాని బీద ప్రజానీకానికి ఎటువంటి సహాయం చేయడంలేదని మనవిచేస్తున్నాను. ఒకచిన్న ఉదాహరణ తమదృష్టికి తీసుకువస్తున్నాను. I. P. C 430Section ఉన్నది. ఒకరి తాలూకు irrigation rights injure చేసినప్పుడు ఆ విషయమై Court లో అర్జీ పెట్టుటకు అవకాశం ఉన్నది. ఇప్పుడు A and B అనే ఆసాములు ఉన్నారనుకోండి. A అనేవాడు ధనవంతుడు, B అనేవాడు పేదవాడు. A అనేవానికి B అనేవాని పొలంలోనుంచి నీరు పోవలసియుంది. ఆ ధనవంతుడు పేదవాడు తాలూకు భూమి కొనుక్కోడానికి సకల ప్రయత్నం చేశాడు. అడిగాడు ఇవ్వలేదు. అందుచేత ధనవంతుడు ఏమిచేశాడంటే పోలీసు రిపోర్టు ఇచ్చాడు నా పొలంలోకి నీరురావడానికి B అడ్డుపెడుతున్నాడని. వెంటనే Police వారు అక్కడకువెళ్ళి అతనిని arrest చేసి తీసుకువెళ్ళి charge sheet కూడా file చేశారు కాని ధనవంతుడు నీరు రాకుండా అడ్డుచేస్తే B పోయి police complaint

ఇచ్చి ఆ ధనవంతుడు తనకు రావలసిన నీరు రాకుండాజేస్తున్నాడని చెప్పుకుంటే ఇది civil rights మాకేమీ సంబంధంలేదని case ను refer చేశారు. అలాంటప్పుడు పోలీసు విధానం ఏ విధంగా ఉన్నదో మంత్రిగారు ఆలోచించాలి. ఈ Prohibition తీసేసిన తరువాత కొన్ని క్రొత్త Police Station లు పెడుతూ యున్నారు. ఈ Station లు ఏర్పరచడంలో కొన్ని గ్రామాలు ఇది వరకున్న Police station లో నుంచి తీసివేసి కొత్త station లకు కలిపారు. ఇది చాలా కష్టాలకు కారణమవుతూ యున్నవి. నేను ఈ విషయంలో మంత్రిగారికి ఒక Memorandum కూడా ఇచ్చాను. నరసన్నపేట తాలూకా నరసన్నపేట Police station jurisdiction లో యున్న 50,60 గ్రామాలు రెండు మైళ్ళ దూరంలోయున్న నరసన్నపేట station jurisdiction లో నుంచి తీసివేసి 7 మైళ్ళదూరంలోయున్న క్రొత్తగా పెట్టిన కళింగపట్నం పోలీసుస్టేషన్ ఇలాకాలో కలిపారు. ఏదైనా ఒక ఖూనీకేసు జరిగింది అనుకోండి. అప్పుడు ఆ గ్రామానికి ఒక తలారి ఉంటే Sub-Magistrate కు అతనే report తీసుకువెళ్ళి ఇవ్వాలి. తరువాత 7 మైళ్ళు అతనే వెళ్ళి Police Sub Inspector గారికి report ఇవ్వాలి అట్లాంటి పరిస్థితులలో 24 గంటలలోగా report చేరాలంటె ఎంతకష్టమో ఊహించవచ్చును. అందువల్ల మొదట నరసన్నపేట jurisdiction లో యున్న ఆ 50 గ్రామాలను ఈ కళింగపట్నం Police station jurisdiction నుంచి తీసివేసి తిరిగి నరసన్నపేట jurisdiction లో చేర్చమని మంత్రిగారికి మనవి చేస్తున్నాను. శ్రీకాకుళం, జిల్లా ఏర్పడి 6, 7 సంవత్సరాలు కావస్తూ ఉన్నా District Superintendent of Police Office ఇంకా విజయనగరం లోనే ఉంటోంది. దాన్ని త్వరలో శ్రీకాకుళానికి మార్చమని మంత్రిగారికి మనవి చేస్తున్నాను. పోలీసువారు summons serve చేయడంలో చాలా జాప్యం జరుగుతోంది Summon లు తీసుకు వెళ్ళినప్పుడు ఆ ఆసామీ లేడమో లేక refuse చేశాడనో కోర్టులో చెప్పి bailable వారంటో, Non bailable వారంటో తీసుకుని పార్టీలను కష్టపెడుతున్నారు. అది కూడా తమ దృష్టికి తీసుకువస్తున్నాను. ఒక Graduate Sub Inspector గా recruit ఐతే 10, 12 సంవత్సరాలు సర్వీసైనా ఎంత బాగా పనిచేసినా promotion లేకుండా పోతోంది. ఏదైనా vacancy వస్తే, direct recruitment పెట్టి I P. S. అని కొంతమందిని Deputy Superintendent లు గా తీసుకుంటారు. ఆ విధంగా కాకుండా Senior most Sub Inspectors కి Circle Inspetors కి promotion ఇస్తే న్యాయంగా ఉంటుందని మనవి చేస్తున్నాను. ఈ Police department లో చిన్న office లలో insubordination చాలా తక్కువగాఉన్నది. ఈ Sub Inspectors, కు transfers, punishments ఇవన్నీ District Superintendent చేతులలో ఉండడంవల్ల చాలా అన్యాయాలు జరుగుతున్నవి. ఏ జిల్లా సూపరింటెండెంటుకో supply లు చేయలేదనీ, ఇంకా ఏవయిన చెప్పిన స్వంత పనులు చేయలేదని చెప్పి వారిమీద కక్ష తీర్చుకుంటున్నారు. అందువల్ల ఈ transfers, punishments చేసే అధికారం జిల్లా సూపరింటెండెంట్ల చేతులలోలేకుండా ఇంకా పై officer లైనInspector General of Police గారికి ఇస్తే బాగుంటుందని మనవి చేస్తున్నాను. ఉపముఖ్య మంత్రిగారూ,

17th March 1956] [Sri S. Jagannadham]

ఇతర సభ్యులుకూడా Police Depart ment యొక్క ప్రాధాన్యతను గూర్చి చెప్పినారు. ఇతర department లలో ప్రతి officer కు ఒక jeep supply చేస్తున్నారు. Police వారు ఏరాత్రిపడితే ఆరాత్రి, రాత్రివేళలో ఏ భాగాన్నయినా investigation కొఱకు ఏ murder case లో నైనా వెంటనేవారు spot దగ్గరకు వెళ్ళడానికి అవకాశంలేకుండా బాధపడుతూ ఉన్నారు. అప్పుడు ఏ Bus operator నైనా పట్టుకుని ఆ Bus లో వెళ్ళవలసివస్తోంది. ప్రతి police station కి ఒక jeep ఇచ్చి లేక కనీసం ఒక్కొక్క circle కి ఐనా ఒక jeep supply చేస్తారని ఆశిస్తున్నాను. పోలీసు department లో Special Branch లో పనిచేస్తున్న వారికి ఏదోకొంత వేరే allowance ఇస్తున్నారు. కాని Sub Inspecter నుంచి Circle Inspector గా promote చెయ్యగానే ఆ allowance తీసేస్తున్నారు అదిఎందుకు చేస్తున్నారో నాకు అర్థంకావడంలేదు. మదరాసునుంచి transfer అయి.వాళ్ళకిమాత్రం ఈ allowonce continue చేస్తున్నారు. కాని ఇప్పుడు Andhra Branch కి recruit ఐన Sub Inspector లకు, Circle Inspector గా promotion వచ్చేసరికి ఆ allowance తీసేస్తున్నారు. అది అన్యాయమనిచెప్పి మంత్రిగారిదృష్టికి తీసుకు వస్తున్నాను.

Sri P. VENKATARAVANAPPA :— అధ్యక్ష మహాశయా ? ఈనాడు ఉపముఖ్య మంత్రిగారు ప్రవేశపెట్టిన ఈ మూడు పద్దులను నేను హృదయ పూర్వకంగా ఆమోదిస్తూ కొన్ని సూచనలు చేయదలచాను. District Munsiff Court లలో దావాలు సంవత్సరాల పర్యంతం తీర్పులేకుండా విచారణ పొడిగింప బడుతోంది. ఏ పార్టీ నెగ్గినా, ఏ పార్టీ ఓడినా ఉభయులూ చాలా వ్యయప్రయాసలకు గురి అవుతున్నారు. గెల్చిన వాడు ఓడిపోయిన వాడుగానూ, ఓడినవాడు చచ్చిపోయిన వాడుగానూ అయ్యేటటువంటి పరిస్థితులు ఏర్పడుతున్నవి. అందువల్ల ఈ జిల్లామునసబు కోర్టులలో civil వ్యవహారాలు జాప్యంలేకుండా త్వరలో పరిష్కారం అయ్యేటట్లు మంత్రిగారు తగుచర్య తీసుకుంటారని మనవిచేస్తున్నాను

సివిలు క్రిమినల్ వ్యవహారాలలో అచ్చటచ్చట కొన్ని ముఖ్యమైన సెంటర్లలో mobile courts ఏర్పాటుచేసి ఆయా ప్రాంతాల వ్యవహారాలను, ఆ చోటులోనే పరిష్కారము చేసిన యెడల ప్రజలకు ఎంతో సౌకర్యముగా ఉండును గనుక ఈ విషయం ఆలోచించవలెను. ఇప్పుడు మైసూరు రాష్ట్రంలో ఈ విధమైన కోర్టులు ఏర్పాటు చేశారు. కాబట్టి మన రాష్ట్రంలో కూడా అటువంటి మొబైల్ కోర్టులను ఏర్పాటు చేయవలెనని కోరుతున్నాను.

ప్రొహిబిషన్ శాఖ సక్రమముగా పనిచేయలేదని దానిని తొలగించి ఈ బాధ్యతలను పోలీసువారికి ఒప్పచెప్పినారు. ఇది సంతోషకరమైన విషయం. ఇప్పుడు పోలీసు శాఖకు బాధ్యతలు చాలా ఎక్కువైనవి కాబట్టి వారు త్రాగుడు అరికట్టడం కోసం, దొంగ సారాయిని తయారు చేయడం అరికట్టడానికి, ఇంకా క్రిమినల్ కేసులు ఎక్కువ జరుగుతున్నాయి. కాబట్టి ఆయా ప్రాంతాలలో కొన్ని పోలీసు స్టేషన్‌లను ఏర్పాటు చేసి సాధ్యమైనంత వరకు ఇటువంటి అక్రమ చర్యలను అరికట్ట చేయవలసిందిగా ప్రభుత్వం వారిని కోరుచున్నాను.

[Sri P Venkataravanappa] ]17th March 1956

పోలీసువారి మ్యూటి దేశ ప్రజల సంరక్షణ, భద్రత, శాంతి నెలకొల్పడము అని, వారు ఈ ధర్మాన్ని సక్రమముగా నిర్వహిస్తున్నారని ఈనాడు, మన ఉప ముఖ్యమంత్రిగారు ఈ సభలో మనవి చేశారు. ఈ రెండున్నర సంవత్సరముల తర్వాత Police Department లో crimes చాలా తగ్గినవని మంత్రిగారు చెప్పినందుకు చాలా సంతోషం. అందుకోసం ఈ డిపార్టుమెంటువారిని ఎంతయో అభినందించవలసి యున్నది. కాని ఇంతటితో నాకు తృప్తిలేదు. ఇంకా అనేక విషయాలలో ఈ డిపార్టుమెంటులో లోపాలున్నవని వారిదృష్టికి తేదల్చుకొన్నాను చాలాచోట్ల పోలీసువారిలో-డిస్ట్రిక్టు లెవెలు ఉద్యోగులలో కాదు- క్రిందివారిలో త్రాగుడు, జూదం, ఎక్కువగా ఉన్నదని చెప్పడానికి నేను, చాలా చింతించు చున్నాను. వీరు-ముఖ్యముగా ప్రజాసేవ చేయవలసిన వారు. ఉదాహరణ కర్తలుగా ఉండవలసినవారు, ఇటువంటి అక్రమ చర్యలకు దిగడం ప్రజలకు తొందరగా ఉంటోంది గనుక ఇకమీదట వారు నీచవృత్తులను మానుకొని ప్రజలకు సరియైన సేవచేసి ఉదాహరణ పూర్వకముగా వీరు ఆచరింతురని మనవి చేస్తున్నాను.

కొన్నిచోట్ల పల్లెలలో కొందరు నీళ్ళు త్రాగేదానికి లేదా బావులనుండి నీరు తోడినపుడు కప్పిలతో నీరు తోడు కుంటున్న సమయంలో అకస్మాత్తుగా బావిలో పడినపుడు, వారికుటుంబీకులు శవాన్ని పెట్టుకొని ఎక్కువగా విలపించుచుంటే, పోలీసు లక్కడకుపోయి, పోలీసుల ఉత్తరవు లేనిదీ ఆ శవమును దహనం చేసే అధికారంలేదు గనుక భూతదయ పశ్చాత్తాపం లేక వారినుండి లంచాలు లేనిదే దహన ఉత్తరువు ఇవ్వటానికి నిరాకరిస్తున్నారు. ఇది రెండవ విషాదకరమైన విషయం గనుక వారటువంటి అక్రమ కృత్యాలలో ఎంతమాత్రము జోక్యం కలిగించుకొనకుండా, భూతదయ పశ్చాత్తాపం కలిగి ఉంటారని వారి ధర్మం నెరవేరుస్తారని కోరుచున్నాను. న్యాయంగా ఈ పోలీసు శాఖపై బాధ్యత ఎంతో ఉన్నది. మన దేశ భద్రత కోసం సంరక్షణ కోసం శాంతి కోసం పాటు పడవలసినవారు గనుక వారి విద్యుక్త ధర్మాన్ని నెఱవేర్చుటకు ఉప ముఖ్య మంత్రి గారు తగిన శ్రద్ధతీసుకొన వలెనని కోరుతూ ఈ అవకాశం ఇచ్చినందులకు అధ్యక్షుల వారికి నా వందనములు తెలుపు కొంటున్నాను.

Sri T VEERARAGHAVULU.— అధ్యక్షా! ఇటీవలనే శ్రీ రాజగోపాలాచారిగారు నెమ్మదిగా మాట్లాడడము అనే ఉద్యమం ప్రారంభించినారు. అది ఈ శాసన సభలో నేను ప్రారంభం చేద్దామా అని అనుకుంటున్నాను. కాలం కూడా అయిదు నిమిషాలే అన్నారు. అది చాలా అనుగుణ్యంగానే ఉంది.

మన ఉప ముఖ్య మంత్రిగారు ఈవేళ డిమాండును ప్రవేశ పెట్టినప్పుడు, ఒకటి సెలవిచ్చారు. రక్షకభటులుగా ఉన్నవారు, వారు విధి నిర్వాహణలో ప్రశంసాపాత్రముగా, జాగ్రత్తగా పనిచేసినారని వారిని అభినందించవలెనని చెప్పి సంఖ్యా వివరములు చెప్పారు. అది చాలా సంతోషం. అయితే ఈ సంఖ్యా వివరాలు ఇచ్చే సందర్భంలో ఒక పద్ధతి ఉంది ఈ దేశంలో ఉందో లేదో నాకు తెలియదు. "The Crime of imprison-ment" అని బెర్నార్డ్‌షా వ్రాస్తూ నేరాలు జరిగిన వెన్ని, రిపోర్టులయినవి ఎన్ని, ఎన్ని కేసులు డిటెక్ట్ అయినవి, డిటెక్టు అయిన కేసులలో ఎన్ని నిలబడిన వని సంఖ్యా వివరాలు ఇవ్వవలెనని అన్నారు. ఈ స్టేటుమెంటు ఈనాడు చాలా హాస్యాస్పదంగా ఉంటున్నదని నేననుకుంటున్నాను. మన దేశంలో ఎట్లా జరుగుతోందో నాకు

17th March 1956] [Sri T. Veeraraghavulu]

తెలియదు. ప్రత్యక్ష అనుభవం లేదు. అటువంటిది కాకుండా, నేరాల ఆమోకి తీయ గలిగిన పద్ధతులు సమర్థనీయమైతే వారు మన ప్రశంసలకు, జోహారులకు అర్హులని మనవిచేసుకుంటున్నాను. శ్రేయోరాజ్యస్థాపన మన లక్ష్యంగా పెట్టుకున్నాము. పోలీసు రాజ్యస్థాపనలో ఉన్న పద్ధతులను సంస్థలను రక్షించుకుంటూ ఆ సంస్థలను జాగ్రత్తగా నిర్వహిస్తున్నామని చెప్పుకుంటూ మనము మురిసిపోవడం తగదు. నేరంపట్ల, నేరస్థులపట్ల ఏవిధంగా ఉండవలెను అనే సందర్భంలో నూతనమైన విప్లవాత్మకమైన ఆధునిక పద్ధతులు ప్రపంచములో ఈనాడు వస్తూ ఉన్నవి. నేరస్థులుకూడా మన సోదరులే, సమాజంలో వారులే అని నేరస్థులు కూడా సమాజంలో పునరావాసస్థితి కల్పనకు అర్హుడు అన్న దృష్టితో ఎన్నో మార్పులు ఇతరదేశాలలో జరుగుతూ ఉన్నవి. అయినా సంస్కరణాభిలాష మన దేశీయులు కూడా చూపుతూ ఉన్నారు. కాని ఇది కేవలం నామ మాత్రంగా ఉన్నది. లక్షణాలకు మాత్రమే మనము మందు వేస్తున్నాము తప్ప వ్యాధి పూర్తిగా పోవడానికి పునాదికి మందులు, వైద్యం లేదు, జెయిళ్ళ సంఖ్య తగ్గాలి పోలీసుల సంఖ్య తగ్గాలి. అప్పుడే మనము గర్వించాలి. ఆ సమాజం మంచిదని చెప్పుకోవాలి. అటువంటి సమాజస్థాపనకు గాను, ప్రత్యేక కృషి ఏమి తీసుకొంటున్నాము? విప్లవాత్మక దృష్టితో ఏమి మార్పులు తీసుకొనివస్తున్నారు? ఎందుచేతనంటే, ప్రశ్నోత్తర సమయంలో మత్స్య శాఖామాత్యులు చెప్పినమాట జ్ఞాపకం ఉంది. ఎప్పుడైనా గీతపని వారు ద్రోహం ఒకసారి చేసి ఇప్పుడు నీరా పర్మిటు అడిగితే వారి ప్రీవియస్ కాండక్ట్ ఆలోచించి వారికి పర్మిటు ఇవ్వడం తగదని చెప్పారు. ఇది దురదృష్టకరమైన దృక్పథం అని మనవి చెయ్యడానికి సాహసించి వందులకు క్షమించాలి. ఎందుచేతనంటే విరుద్యోగిగా ఉన్నవాడు పేదరికంలో అలమటిస్తున్నవాడు సంఘవిద్రోహ చర్యలు తప్ప జీవనం చేయడానికి వీలు లేనటువంటివారు చేసినపొరపాటు దిద్దుకొని ప్రయోజనకరముగా జీవనం గడపడానికి సమాజంలో సానుభూతితో పరిశీలించడం అవసరమని మనవి చేస్తున్నాను. ఇటీవలనే ఇంగ్లండులో కేపిటల్ పనిష్మెంటు రద్దు చేసుకొన్నారు. నేరస్థులుపట్ల ఎటువంటి దృక్పథంతో వారు ఉన్నారో వారు ఒకసారి గమనించ వలసినదిగా వారిని కోరుచున్నాను. న్యాయస్థానము సత్వరంగా, చౌకగా అందుబాటులో ఉండినట్లు చూడడానికి యావదాంధ్రరాష్ట్ర స్థాయిలో ప్రభుత్వం ఒక కమిటీని ఏర్పాటు చేశారు. మహోత్కృష్టమైన ఆశయంకోసం కృషిచేసి మనకు సహాయపడుతుందని నేను ఆశిస్తున్నాను.

ఇక Police Short-hand Bureau గురించి ఇద్దరు ముగ్గురు సభ్యులు చెప్పారు. అది చాలా అవసరం రూ. 80 తో ప్రారంభించి 25 సంవత్సరాలకు రూ 150 మీద చేరిపోయి అక్కడ ఉండిపోవడం ఆస్థితిలోనే చేరినవారు సబ్-డివిజనల్ ఆఫీసర్లు D. S. P. లు కావడం ఎంతో ఆశ్చర్యంగా నేవుంది. ఇది ఎంతో అసంతృప్తికి దారి తీస్తూవుంది. అదికూడా ప్రభుత్వం పరిశీలించాలని కోరుతున్నాను. ఉపముఖ్య మంత్రిగారు ఇది తప్పకుండా గమనిస్తారని వారిని సంతృప్తి పరచడానికి తగినట్టి సబ్బైనటువంటి రీతిగా వారిని ఆదరిస్తారని మనవి చేసుకొంటున్నాను.

వ్యభిచార నిర్మూలనం, జూదగొండితనం నిర్మూలించడం, మద్యం వాడకుండా చేయడం ఇటువంటివన్నీకూడా పోలీసు శాఖవారికి అప్పగించడం శ్రేయోదాయకంగా ప్రభుత్వంవారు భావిస్తున్నట్లు నేను అనుకొంటున్నాను. అయితే కేసులన్నీ చూచి

చూస్తే చిన్నతనంలో చదివిన చిలకమర్తి లక్ష్మీనరసింహంపంతులుగారి ప్రహసనం జ్ఞాపకమొస్తున్నది. దొంగతనం జరిగిందని Police వారికి report ఇస్తే "దొంగ లెవరో చెప్పవోయ్, నీ అనుమానం ఎవరిమీదో చెప్పు, దొంగ ఏదారిన పారిపోయాడో చెప్పు." అంటేవారు చెప్పుతారా? దోమకుట్టితే మందేమిటి? అసలు దోమను పట్టుకొని రెండు రెక్కలూ కత్తిరించి ఔషధమును వారిచ్చే సూది మొనతో వేయమని చెప్పినట్లు ఈ పద్ధతిలో పోలీసువారలు ప్రవర్తిస్తున్నారు. రిక్రూటుమెంటు జరిగే టప్పుడు ఎట్టగా బుట్టగానున్నాడా? ఆరడుగులున్నాడా? ఎనిమిదడుగులున్నాడా? అనేటటువంటి పద్ధతి కాకుండా వాడు తెలివితేటలుగా యుక్తిగా న్యాయాన్ని రాబట్టగలడా? ఆచోకీ తీయగలడా లేడా అనే టటువంటి బుద్ధికి ప్రాధాన్యము ఇచ్చి recruit చేస్తే బాగుంటుంది ఇటువంటి పోలీసువారు ప్రజలకు ఉపకారులుగా ఉండడానికి అవకాశం ఉంటుందని మనవి చేస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

Sri N SRINIVASA RAO — అధ్యక్షా, ఈ డిమాండును బలపరుస్తూ ఉపముఖ్యమంత్రిగారి దృష్టికి కొన్ని విషయములను తీసుకొని వస్తున్నాను. సాధారణంగా జైళ్ళలోను Police Department లోను చిన్న ఉద్యోగస్థులుగా నున్నవారు హరిజనులు, హరిజన క్రైస్తవులు అన్న విషయం తమ అందరికి తెలిసినటువంటిదే. అయితే రాజమండ్రి జైలులో వందమంది warders ఉంటే అందులో 80 మంది హరిజనులున్నారు. కానీ warders quarters దగ్గర కట్టినటువంటి నీటి సదుపాయంలో మాత్రం 80 మంది హరిజనులను నీళ్ళు తాగనివ్వకుండా చాలా ఇబ్బందులు పెట్టుతున్నారు. అనేకసార్లు చెప్పాం. ఇదేమిటయ్యా మీరు చిలుకమర్తి లక్ష్మీనరసింహము పంతులుగారు పుట్టినటువంటి గ్రామంలో ప్రక్క సోదరులను నీళ్ళు త్రాగకుండా చెయ్యడం అన్యాయమని చెప్పాం. కాని ఇప్పటికికూడా ఆ పరిస్థితులు అల్లాగే ఉన్నవి. జైళ్ళలో ఉండే వార్డర్సులో హెచ్చుమందిని నీళ్ళు తీసుకోకుండా నిరోధించడమంటే అల్లా ఎందుకు జరుగుతుంది అని అడిగినట్లయితే అక్కడ ఉండిన జైలర్లు, Head warders, Superintendents, ఏదైనా చేసినట్లయితే వీళ్ళయొక్క Confidential Report లను పాడుచేస్తారనే దృష్టివల్ల మేము నోరు మూసుకొని ఉన్నాము. వారు తోడిపోసినప్పుడే నీరు త్రాగటానికి వీలుందని వారు చెప్పుతున్నారు. దాన్ని Enquiry చేసి అరికట్టించాల్సిందని ప్రార్థిస్తున్నాను. రెండవది వార్డర్లను గురించి సాధారణంగా అందరికీ కోపముండవచ్చు. ఎందుచేతనంటే చాలామంది జైలుకు వెళ్ళివచ్చినవాళ్ళు కాబట్టి, వారికి అప్పుడు వార్డర్లు వస్తువులు supply చేయలేదనో పార్టీ చరిత్రలు, పుస్తకాలూ ఇవ్వలేదనో కోపం ఉంటుంది. అయితే, "వార్డరూ వార్డరు, జైలు వార్డరు, వాడిపోయిన ముఖము రంగువెలసిన టోపి, పీకుపోయిన మోకాళ్ళకు పీడాకారపు పట్టీకట్టీ, వచ్చేపోయే ఆఫీసర్లకు ఒంటిచేత సలాముకొట్టే వార్డరు అదిగో జైలు వార్డరు" "Head Warder లకు Good Night లు, Chief warder కు సెల్యూట్లు జైలర్లకు కవాతు సలాము. కొట్టలేదని తిట్టుతూ ఉంటే, కోపమువచ్చిన ఓపికపట్టి, కడుపుకోసమై కష్టాలన్నీ ఓర్చుకుతిరిగే warder అదుగో జైలు వార్డరు. "పగలంతా పారాఇచ్చి, రాత్రి Duty భారం పడగా, నిద్రదేవతా నెత్తికెక్కగా రౌండాఫీసరు గుండెదడతో, కారుమేఘాలు చూస్తు జడిసీ కడుపుకాలే ఖైదీలతో పిచ్చాపాటీ ముచ్చటించే వార్డరు అదుగో జైలు వార్డరు".

17th March 1956]

Mr. SPEAKER — Objectionable peformance చేస్తున్నారేమో.

Sri N SREENIVASA RAO — అందుచేత మిల్లు కూలీలు, రైలు కూలీలు, మూటకూలీలు, చోటుకూలీలు, వీధులు ఊడ్చే కూలీలు సహితం "సంఘం పెట్టుక పొందక సౌఖ్యం, వార్డరు మాత్రం దిక్కు తెలియక దిక్కు మొగముతో, ఇరుకు ఇంటిలో, ఇబ్బందులతో సరిగా జరుగని సంసారముతో ఉస్సూరుమంటూ కాలము గడిపే వార్డరు అడుగో జైలు వార్డరు" అయితే దీనికి ఆర్థిక పరిస్థితి అడ్డమొస్తుందా అంటే వీళ్ళసంఖ్య చాలా తక్కువ. పాపం వాళ్లలో చాలామంది తమకు పుట్టినటువంటి బిడ్డల్ని recognise చేసుకోలేరు. పిల్లలు తండ్రులను recognise చేసుకోలేనటువంటి పరిస్థితులలో వాళ్ళుడ్యూటీలు చేస్తున్నారు. ఇందుచేత వారియొక్క పరిస్థితులను ప్రభుత్వం పరిశీలించవలసి యున్నది.

బ్రిటిషు ప్రభుత్వకాలములో మనలను వాళ్ళు ఇబ్బందులు పెట్టారుకాని ఇటీవల వాళ్ళు కొంత లిబరల్ గానే ఉన్నారు. అందుచేత చాలామంది కమ్యూనిస్టు వ్యక్తులు పారిపోయి బయటికి రావడంకూడా జరిగింది. అందుచేత ఈ లిబరలిజాన్ని కొంచెము తగ్గించి, ప్రస్తుతం ప్రభుత్వ వ్యతిరేక వాఙ్మయం లోపలికెళ్ళకుండా చూడాలి. ఆనాటి బ్రిటిషు గవర్నమెంటు పరిస్థితులలో అనేక విషయాలుగా వారు దేశభక్తితో తోడ్పడ్డారు. కాని లోపలికి వెళ్ళిన మన మిత్రులు వాళ్ళను tempt చెయ్యకుండా, జైలులోకి పోయినప్పుడు, అది పట్టుకురా, ఇది పట్టుకురా అని పదో, పాతికో ఇస్తే తక్కువ జీతగాళ్ళుమి చేస్తారంటే ఈ పనిని నెరవేరుస్తారు అన్నమాట. మా పార్టీ పత్రికలు పట్టుకురారా 15 రూపాయలు ఇస్తానంటే వాడికి ½ నెల జీతం వచ్చేస్తుంది. తప్పకుండా ఏ టోపీలోనో ఎక్కడనో పెట్టుకునివస్తాడు. ఇంకొక విషయం. Police ల విషయంలో వాళ్ళకు అప్పీళ్ళున్నవి సంజీవరెడ్డిగారు మినిస్టరు అయిన తర్వాత నేను కొద్దిసార్లే వారిని కలుసుకొని ఉంటాను, ఈ కలుసుకొన్నవాటిలో ఎక్కువ భాగం పోలీసు వాళ్ళ అప్పీళ్ళకోసమే. వారు పాపం plain గా చెప్పేవారు. అబ్బాయీ? ఇంత మహాసముద్రంలో మామూలు పోలీసువాళ్ళ అప్పీలుకూడా చదవడానికి సమయముందా? నువ్వేకాసేపు Deputy Chief Minister అనుకో, (అని వారు చెప్పలేదనుకోండి ఆత్మ సంతృప్తికోసం నేనన్నాను) నువ్వు చదవగలవా అని ప్రశ్నించారు. వాస్తవమే. కాని జరుగుతున్నది ఏమిటంటే - 25 సంవత్సరాలు, 27 సంవత్సరాలు పనిచేసిన తర్వాత ఏదో కారణంచేత క్రిందనేమో Dismiss చేస్తే దానిపైన Circle Inspector, తరువాతనేమో D. I G I G. కూడా చదవడంలేదు. వారి దగ్గరకు వెళ్ళితే అదే చెబుతారు. Circle Inspector గారు type చేసి పంపిన కాగితాలను చదువగల్గుతాను గాని సరి క్రిందవాళ్ళదంతా చదువడం కష్టమని అంటున్నారు. అయితే ఇంత చిన్న ఉద్యోగం చెస్తున్నవాడిని 25, 27, 29 సంవత్సరాలు పనిచేసి ఇంకో ఆరుమాసాల్లో వెళ్ళిపోయేవాడిని కూడా dismiss చేస్తారు. ఆలాంటి విషయాల్లో Minister గారికి అవకాశం లేకపోతే అవసరం అయితే ఒక Deputy minister నో, లేక సెక్రెటరీనో లేక ఒకకమిటీనో వేసుకొని వాళ్ళకు న్యాయ్యంజరిగేటట్టు చూడాలిగాని, అబ్బాయీ చిన్న మాజిస్ట్రేటు కోర్టులో పోయింది కొట్టి జిల్లా కోర్టులో కూడ వాళ్ళ న్యాయం

చేయలేదా, High court కు ఎందుకొచ్చావు అని High court న్యాయం చేయలేదా, Supreme Court కు ఎందుకొచ్చావని అంటే ఎట్లా ఉంటుందో ఇది కూడా ఆ విధముగా ఉన్నది. కాబట్టి అక్రమాలు జరుగటానికి సావకాశం ఉన్నది. జయిలులో మరి పైన తిరుగుబాటు చేసి విప్లవాలు సాధిస్తా ననుకొనేవాళ్ళకు ration ను రు. 0-4-0 నుంచి రు. 2-14-0 లకు పెంచినాము. వాళ్ళకు అలవెన్సులు, కంటిఅద్దాలు ఇచ్చాము. వాళ్ళకు వంటి జబ్బుచేస్తే ఏ రష్యా దేశానికో పంపించి ఎట్లామందు నీళ్ళు ఇప్పించడానికి ప్రయత్నం చేసే మనం ముప్పావలా డబ్బుల్ని basic ration ను ఎప్పుడో మామూలు రోజుల్లో ఇచ్చిన దానిని ఇంకా అట్లాగే ఉంచితే రక్షకభటులు ఎంతో బాధపడుతున్నారు. అందువల్లనే ఎక్కువగా పొరబాట్లు చేయుడానికి సావకాశాలుంటవని మనవి చేస్తున్నాను. ఈ మధ్య ఏలూరులో కమ్యూనిస్టుపార్టీవారి చర్యలు తగ్గిపోయినందుకు హర్షామోదాలు ప్రకటిస్తూ అమ్మన్నరాజాగారు, కాశేశ్వరరావుగారు చెప్పారు. పాపం అమ్మన్నరాజాగారు West Godavari కి కొంత దూరంలో ఉండడం వల్లనో తరచుగా అందరికన్నా ఎక్కువగా నియోజకవర్గానికి వస్తారనుకోండి. కాశేశ్వరరావుగారికి వృద్ధాప్యంవల్లనో వారికి అన్ని విషయాలు సరిగా తెలియక పోవచ్చు. ఏలూరులో ఈ మధ్య బహిరంగంగా మాలంకోవ్, బుల్గానిన్ వేషాలువేసి వేసి లారీలో ముందువరుసలో కూర్చుండబెట్టి నెహ్రూను వెనుకన కూర్చుండబెట్టి ఊరేగింపు ప్రారంభించారు. పౌరులు ఇది అధర్మమైన విషయమని చెప్పారు. మా నాయకుని వేషం తీసేసి, మీ వేమయ్య, సుందరయ్య మొదలుకొని అజయకుమారు వరకు వేషాలు వేసుకొని ఊరేగించండి మాకేలాంటి అభ్యంతరమూ లేదు. మా నెహ్రూను కలిపినప్పుడు వెనుక కూర్చోబెట్టడట మెందుకు ? పెట్టే ఈ జండాలు, ఆ జండాలు కలిపి పెట్టాలి ? అని అక్కడ ఉండే బోస్ శిబిరం వాళ్ళు ఎదిరిస్తే ఆ పరిస్థితులలో దెబ్బలాటలు జరిగితే అక్కడుండే పోలీసు సోదరులు పరిస్థితులను అదుపులో పెట్టారు. గౌరమ్మసంబర మేమిటో నెహ్రూ వేష మేమిటో, కాంగ్రెసువారిని కొట్టడ మేమిటో వాళ్ళను జెయిలులో పెట్టవలసిన అవుసర మేమిటో కొంచెం విచారించవలసియున్నది. ఈ విషయము సంజీవరెడ్డిగారి దగ్గరకు వచ్చింది. 'మీ బట్టలు' పట్టిస్తాము, మీ వ్యవహారం తేలుస్తాము, పిల్లలమర్రితో ప్రశ్నలు వేయిస్తాం, వేమయ్యతో శతకం వ్రాయిస్తాం అని బెదరించి పోలీసుల ఉపకారాన్ని పొందగలుగుతున్నారే తప్ప కమ్యూనిస్టులు ప్రజలకు ఎటువంటి ఉపకారము చేయలేకపోతున్నారు.

ఊరు కాలిపోతుంది హుస్సేన్ సాయెబూ అంటే నాదేంపోయింది గడ్డంసాయెబూ అన్నట్లు 'పోలీసుస్టేషనుముందు సారా కాస్తున్నారండి, నేను చూశానండి మొదలకుండా వచ్చానండి; అసెంబ్లీలో ఉపన్యాసంకు కథావస్తువుగా దాచుకున్నానండి' అని మన నాగిరెడ్డిగారు చెప్పడం చాలా ఆశ్చర్యం. త్రాగుడు త్రాగినట్లయితే వెంటనే, ఆయన శాసనసభ్యుడు, ఆంగ్లభాష పరిచయం కలిగినవాడు, అనర్గళంగా అనేక గంటలు అసెంబ్లీలో మట్లాడ కలిగినవ్యక్తి, కాగితంమీద వ్రాసో, తాను కష్టపడి వెళ్ళో సమాజం అక్రమంగా జరుగుతుందని ఒకరిని పట్టివ్వడానికి ప్రయత్నం చేసేబదులు అన్నిచోట్ల జరుగుతున్నదండి మేము చూస్తూ ఉన్నామండి, మీకు Vote లు వేసినవాళ్ళంతా త్రాగుతున్నారండి, మాకూ 45% వచ్చిందండి 45% వచ్చినవాళ్ళుకూడా బట్టలు పెట్టుకుని త్రాగుతున్నారండి, వాళ్ళు పిచ్చికుంచాలతో గింజలేయిస్తున్నారండి,

17th March 1956] [Sri N Srinivasa Rao]

సమాజం బాగుపడాలండి నేనుమాత్రం ఎకరం యివ్వనండి నేను పిచ్చుకుంచాలే యిస్తానండి నేనుకూడా త్రాగమని చెబుతానండి త్రాగుడ నేటటువంటిది poor man's food అని ఉపన్యాసాలు చెబితే ఎంతఅర్థం వున్నదో యిప్పుడు వీరుచెప్పే వాదంలోకూడా అంతేఅర్థం వుందని మనవిచేస్తూ యీ అవకాశం యిచ్చినందుకు Speaker గారికి మరీ మరీ మరీ మరీ వందనాలు సమర్పించుకొంటూ విరమిస్తున్నాను.

Sri B. RAMI REDDI.— అధ్యక్షా, నాకిచ్చే అవకాశాన్ని అయిదు నిముషాలని ఎప్పుడూ చెప్పడంవల్ల యీ అయిదు నిముషాల నేది permanent అని నాకు అనుమానం కలుగుతున్నది. ఈ రోజు కొంచెం నాకు తెలిసిన Subject కాబట్టి temporary గా నైనా promotion యివ్వమని ప్రార్థిస్తున్నాను. ఇప్పుడున్న మూడు subject లలో ఉపముఖ్య మంత్రిగారు పెట్టినటువంటి jail విషయంలో ఒకటి రెండు మాటలు మాత్రం మాట్లాడి పోలీసుల విషయం వివరంగా మాట్లాడ దలచుకున్నాను. జైళ్ళు యిప్పుడున్న పరిస్థితులలో కేవలం నరకకూపములుగా వున్నాయని చెప్పి ఒక మాటతో ముగిస్తున్నాను. వాటిని కేవలం సంస్కరణాభిలాషతో ప్రయత్నంచేస్తే బాగుంటుంది. ఎందుకంటే అనేక నేరాలుచేసి కేవలం గడ్డు కట్టినటువంటి దుష్ప్రవర్తకు లందరిని చేర్చి ఒక స్థలంలో వారు బయటకు వచ్చేవరకు ఒక నూతనజీవిత పంథాలో నడచేవరకు మార్పుతెస్తే బాగుంటుంది. మరింత గడ్డువారిని కేవలం దుర్మార్గవృత్తిలోనుంచి బయటికి వచ్చేదానికి అవకాశం కలుగచేయకుండా ఏదో ఒక విధమైనటువంటి ఒక School నామకేవాస్తే వున్నది. అట్లాకాకుండా School లో నుంచి చాకచక్యముగల గొప్ప మేధావులనుపెట్టి అప్పుడప్పుడు meeting లు పెట్టి వారిని సత్ప్రవర్తనగాములుగా చేసి బయటకు తెప్పించే మార్గం చూడాలి ఒకటి. రెండోది C class నేరస్థులకు యిచ్చినటువంటి ఆహారం-యిప్పటికీ కూడా నేను అనుభవంతో చెబుతున్నాను. కూరగాయలు పైనుంచి క్రిందవరకు మార్చుకుంటూ నేరస్థుల దగ్గరకు వచ్చేవరకు పుచ్చిపోయినవి మాత్రం మిగుల్తూ వుంటాయి అదీ జైలులో మనకున్న అనుభవం. దానిని ఏ విధంగానైనా మార్పుచేసే పద్ధతి చూడాలని మాత్రం వారికి మనవి చేసుకుంటున్నాను. కాగా Police విషయం. కొందరు మిత్రులు పోలీసు దుస్తులు టోపీలు మార్చాలనిచెప్పారు అవిమార్చి ప్రయోజనంలేదు. వారిహృదయాలు మార్చాలి. హృదయం మార్చాలంటే ఒకటేసూత్రం. ఆర్థికంగా వారియొక్క స్తోమత పెంచితేనేగాని హృదయాలు మారవు వారు ఆర్థికంగా బాగుపడితేనేగాని నేను ఒకమనిషినే అని ఒక విధమైన జవాబ్దారీతో ఆలోచించ గలుగుతాడు. కాని ఒకటిమాత్రం చెప్పగలను. మన ఆంధ్రరాష్ట్రం వచ్చినతరువాత, స్వరాజ్యం వచ్చిన వెనుక పోలీసుల నైతిక ప్రవర్తనలో కొంతవరకు మెరుగు కనిపిస్తున్నదని ఒప్పుకోక తప్పదు. పూర్వం బానిస రాజ్యంగా వున్నప్పటి వారి ప్రవర్తనకంటె ఇది నా రాజ్యమని వారుకూడా అవగాహన చేసుకున్నారని నేను తెలుసుకున్నాను. మరొకటి అప్రస్తుతం కావచ్చుకుంటాను. మంత్రులకున్నటువంటి బాధ ఒకటున్నది. ప్రజానుగుణంగా పోదామాఅంటే అధికారులకు ఒకవిధంగా సరిపోదు అధికారులకు అనుగుణంగా పోదామా అంటే ప్రజలకు ఒక విధంగా సరిపోదు. నాకు తెలిసినంతవరకు నేను ఉద్యోగులతో సన్నిహితంగా వున్నంతవరకు ఉపముఖ్య మంత్రిగారి దగ్గర ఏమి కళావిశేషం వున్నదో గాని ప్రభుత్వ పక్షముచేత అధికారుల చేత ప్రజలచేత యిద్దరి మన్ననలను అందుకున్నందుకు వారిని కొనియాడకుండా ఉండలే

కున్నాను. పోలీసుల హృదయ పరివర్తన కావాలంటే ఆర్థిక పరిస్థితులు అభివృద్ధికావాలి నేను కూడా సానుభూతి చూపెస్తున్నాను ఆర్థికలోపంవల్ల సహాయం చేయలేకుండా వున్నామని ప్రతి demand లోనూ వినే పదమే. కాని అదికాదని చెప్పడానికి వీలు లేదు. అయినా యిప్పుడు ముఖ్యంగా రాష్ట్రానికి కూడలిప్రాయంగా Pivot గా వున్నది పోలీసుశాఖ. అటువంటి శాఖ అసంతృప్తి వాతావరణంలో వుండడం అనర్థాలకు కారణం కొబట్టి పరిపాలనా నిర్వహణ కుంటుపడిపోతుందనే వారిలో నే నొకడిని. సాధారణంగా యీ ప్రభుత్వ నిర్వహణలో పోలీసులకు కొన్ని లోపాలు కిష్టాలు న్నాయి. అనుభవం వున్నది కాబట్టి చెబుతున్నాను పోలీసు అధికారులు అందరికంటె అటు పైవారికి కాకుండా వున్నది. Police Sub Inspector ఉద్యోగం మాత్రం హిందూమతం, తురకమతం కాకుండా దూదేకుల మతం మాదిరిగా వున్నది. క్రింది Police Constables కు అణకువే. పై అధికారులకు అణకువే. వారికున్నటువంటి duties యింతని చెప్పడానికి లేదు. కాని వారు నిజముగా నియమించబడినది ఎందుకంటే Executive duties చేసేదానికి. కాని అతని నెత్తిపైన Scriptory duties ministerial duties ఎక్కువగా పెట్టారు నాకు తెలిసినంతవరకు కేవలం Paper delay చేసినందుకు మంచి honest officers గా వున్న Sub-Inspectors ఎంతోమంది శిక్షింపబడడం నేను కళ్ళారా చూశాను. కాబట్టి ఒక ఇంగ్లీషు తెలిసిన గుమాస్తాను అయినా యివ్వడం మంచిది. Police Sub Inspector యొక్క ఉద్యోగ నిర్వహణ సమర్థనీయంగా చేయాలంటే అతనిని Srciptory work కు దూరంగా వుంచడం సమంజసమని చెబుతున్నాను. ఇక T. A ల విషయమై ఒక మాట చెబుతున్నాను. వారికి 0-12-0 యిస్తున్నారు. వారు తమయొక్క headquarters నుంచి district headquarters కి పోతారంటే రెండు పూటల తిండికి ఒక రూపాయి వుండాలి, పై ఖర్చు లుంటాయి. అందుచేత district headquarters కు పోయినప్పుడు actual ఖర్చు లివ్వడం సమంజసము. తరువాత Sub-Inspector, Circle Inspectors T. A విషయం ఒకటుంది. ఎక్కడున్నా దూరప్రయాణం చేసినట్లయితే Sub-Inspectorకు 1½ Second Class, Inspector కు మాత్రం II Class plus D. A. యిస్తారు ఆయన D. A. 2-7-0 3-6-0 గ్రేడులో నున్నది. దూర ప్రయాణం చేసినపుడు subordinate కు వచ్చే మొత్తం superior కంటె జాస్తిగా వస్తుంది. ఆ Circle Inspector కు తక్కువ వస్తుంది. అటువంటిది బాధాకరంగా వుంటుందని మీ దృష్టికి తెస్తున్నాను. ఇంకో చిన్న విషయం Local Police Armed Reserve కు యిచ్చే టటువంటి పెద్ద బూట్లు యిస్తున్నారు. వాడు పాపం summons తీసుకొని పల్లెలకు పోవడంలో వర్షాకాలంలో బురదలో కాళ్ళు ఈడ్చుకుంటూ పోవడం అసాధ్యం అందుచేత చెప్పుల జోళ్ళు యివ్వడం మంచిది. Prohibition Police కు యివ్వడం కేవలం మంచిది అని చెబుతున్నాను. Prohibition పోలీసుశాఖను యిచ్చిన వెంటనే ప్రజలలో ఒక విధమైనటువంటి వాతావరణం కలిగింది. అబ్బా వచ్చింది పోలీసులకు అని సగం తగ్గింది. కట్టకడపట యీ పోలీసువాళ్ళకు ఒక విచిత్రమైన ఆచారం వున్నది. Sub-Inspector మంచివాడయి case లు లేకుండా పోతే D S. P. దగ్గరనుంచి why no cases in your station అని తిట్లు వస్తాయి. Security cases ఎందుకులేవని అడుగుతారు.

17th March 1956]

Mr. SPEAKER :— జిల్లాకోర్టులలో white gloves యిస్తారు.

Sri B. RAMI REDDI :— దానివల్ల సత్రాలవెంబడిపోయి, అడుక్కొని వచ్చి పండుకున్నవాళ్ళదగ్గర blades, కత్తెర్లుపెట్టి S. S. C P C. ప్రకారంగా అన్యాయంగా వాళ్ళను నాశనం చేయడం జరుగుతూన్నది.

The Hon Sri N SANJEEVA REDDI :— నాశనం ఎక్కడ చేస్తున్నారు? అడుక్కుతినేవాళ్ళను జైలులోపెట్టి తిండిసహాయం చేస్తూంటే! (నవ్వు).

Sri B. RAMI REDDI :— అందుచేత "Why no cases" అనే order మానుకోవాలి. ఇంకోటి పోలీసువారికి Courtesy week అని ఒకటి పెడుతున్నారు. ఈ వారంరోజులు మాత్రమే Courtesy గా వుండి మిగతా రోజులలో దుర్మార్గంగా వుండాలనా అని అనుమానం వున్నది. Courtesy నేర్పాలి. మొదలయారుగారు చెప్పినట్లు Police విధి నిర్వహణ కష్టమైనది, ప్రాణాంతకమైనది కూడా. వారివిధి నిర్వహణలో ఎప్పుడూ Courtesy వుండాలనే ఉద్దేశంతో పోలీసులకు తగినటువంటి ఉత్సాహం, ప్రోత్సాహం యివ్వాలని ప్రార్థిస్తూ ముగిస్తున్నాను.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా! పోలీసు డిపార్టుమెంటులో Deputy పదవులను తీసివేస్తే బాగుంటుంది అని నేను మొదటినుంచి చెబుతున్నాను "మీ అసెంబ్లీలోనే Deputy లు ఉన్నారు. డిప్యూటీ ముఖ్య మంత్రి, Communist Party deputy leader, Socialist Party deputy leader," ఉన్నారుగాదా మా డిప్యూటీలను తీసివేయుమని అంటారు ఎందువల్ల? అని వారు అంటారేమో అని నాకు భయంగా కూడా ఉన్నది. అయినప్పటికీ డిప్యూటీలను తీసివేయడం చాలా అవసరం అని చెబుతున్నాను. అప్పుడు ఈ పోలీసుశాఖ బాగా ఉంటుంది. అల్లరులు లేకుండా దేశం చాలా ప్రశాంత వాతావరణములో ఉన్నదని సంజీవరెడ్డిగారు చెప్పారు. రిపోర్టులు ఏమీ రాకపోతే ప్రభుత్వానికి పంపకపోతే దేశం చాలా ప్రశాంతంగా ఉన్నట్లుగానే కన్పిస్తుంది. ఆవిధంగా వారికి పనిలేనప్పుడు డిపార్టుమెంటులే ఎత్తివేస్తే బాగుంటుంది గదా అంటే, అట్లా వీలులేదు. ఎప్పుడైన ప్రమాదం రావచ్చును అంటున్నారు.

ప్లానింగు శాఖలో పనిచేసేందుకు మనుష్యులు దొరకకుండా ఉన్నారు. ఎక్కడెక్కడ అయితే Local development works జరుగుతున్నాయో అక్కడకు పోలీసువారిని, రిజర్వును పంపించి, సబ్ఇనస్పెక్టర్ల చేత కూడా తట్టలు మోయిస్తే, దేశాభివృద్ధికి వారు ఎక్కువగా ఉపయోగపడుతారేమో ఆలోచించాలని చెప్పి మంత్రిగారిని కోరుతున్నాను అదనపు సిబ్బందిని ఇతర రాష్ట్రములకు పంపించే దానికన్నా, ఇటువంటి పనులు చేయిస్తే ఈ పోలీసువారంతా కూడా శ్రేయో రాజ్యస్థాపనకు యదార్థంగా కృషి చేసినట్లు అవుతుంది.

పోలీసుశాఖలో క్రింద ఆఫీసర్లనుంచి, పై ఆఫీసర్లవరకు బాగా లంచములు తీసుకుంటున్నారని చాలామంది చెప్పారు. చిన్న ఉద్యోగులు ఎందుకు లంచము తీసుకుంటు

[Sri Vavilala Gopalakrishnayya] [17th March 1956

న్నారో, పెద్ద ఉద్యోగులు ఎందుకు లంచము తీసుకుంటున్నారో ఆలోచించాలి. చిన్నవారికి ఇచ్చే జీతముతో భుక్తిగడవనందున వారు తీసుకుంటున్నారు.

ఈ ఊరిలో ఒక చిన్న సంఘటన జరిగింది. నేను 7½ గంటలకే అసెంబ్లీకి బయలుదేరి వస్తున్నాను. అప్పటికి పోలీసులు అంతా రాలేదు. ఒక పోలీసు కానిస్టేబుల్ మాత్రమే వచ్చినాడు. ఆయన ఎదురుగా ఒక రిక్షావాడు వస్తున్నాడు. ఆ పోలీసు రిక్షావాడిని ఆపి ప్రక్కకు పిలిచి కాఫీకి డబ్బులున్నాయా అని అడుగుతున్నాడు, వాడు జేబు చూపి, నావద్ద 2 అణాలే ఉన్నాయి, నేను ఇంకా కాఫీ అయినా త్రాగ లేదు, నన్ను వదలమని అతడు అడుగుతున్నాడు. సరిలే అని ఆపోలీసు అతనినివదిలాడు. నేను ప్రక్కన ఉండి ఏమిచేస్తాడా అని చూస్తూ ఉన్నాను. వాడిని ఏమీ చేయక వదలి నందుకు ఆ పోలీసును చాలా అభినందించాలి. పై అధికారులు వస్తే వారికి కావలసిన పన్లయిలన్నీ చేయకపోతే, క్రిందవారి మీద చాలా తీవ్రమైన చర్యలు తీసుకుంటారు. పై అధికారుల మనస్తత్వములో మార్పు వస్తేనే గాని, ఇనస్పెక్టర్ల మనస్తత్వములో మార్పు రాదని నేను గట్టిగా చెబుతున్నాను. ఇప్పుడు మనం శ్రేయోరాజ్యం ఏర్పాటు చేయాలని అనుకుంటున్నాము. అందువల్ల ఈ Sub Inspector ల D S P ల I G. ల ఆడంబరములను, వారి హడావుడిలను, తగ్గించేందుకు ఆలోచించి తగిన చర్యలు తీసుకోక పోతే ఈ శ్రేయోరాజ్యపాలన జరగడం చాలా కష్టం అవుతుంది. మనం ఇది వరకు పోలీసు గ్రౌండ్సులో పారేడుకు వెళ్ళినప్పుడు, పోలీసువారంతా ఒకరి తరువాత ఒకరు వరుసగా 8 మంది స్పృహతప్పి పడిపోయినట్లు చూచినాము. తరువాత వాళ్ళను dismiss చేశారో, ఏమి చేశారో తెలియలేదు. Discipline అనే పేరుతో ఓపికను మంచివారిని నిలుచుండబెట్టి, వారి తిండి సంగతికూడా ఆలోచించకుండా ఉంచడం జరుగుతున్నది అందువల్ల శ్రేయోరాజ్యానికి ఉపయోగ పడేటట్లుగా వాళ్ళ జీవితములలో మార్పు తేవడము, విధానాలలో మార్పుచేయడం అవసరం.

సబ్ మేజిస్ట్రేటు 11 గంటలకు ఆఫీసుకు రావలసినా ఆలస్యంగా వస్తున్నారు.

Mr SPEAKER :— Please bring out a specific case.

Sri VAVILALA GOPALAKRISHNAYYA — గుంటూరు లోను, సత్తెనపల్లిలోను ఆఫీసులకు రావడము ఆలస్యము జరుగుతున్నది.

Sri S. RANGANADHA MUDALIAR — Has Separation Scheme been introduced, in his district, Sir ?

The Hon. Sri N. SANJEEVA REDDI .— No.

Sri VAVILALA GOPALAKRISHNAYYA — వచ్చిన కేసు లన్నింటిని 3 నెలలలోగా విచారణపూర్తిచేయాలని, 5, 6 వాయిదాలకంటే ఎక్కువ వేయకూడదని నిబంధనలు పెడితే ప్రజలకు చాలా ఉపయోగంగా ఉంటుంది. ఈ విష యం మంత్రిగారు సానుభూతితో ఆలోచిస్తారని ఆశిస్తున్నాను. గుంటూరు జిల్లాలో Judiciary ని Executive నుంచి separate చేయాలని మేము ఎప్పటినించో అడుగుతున్నాము. అది చేయుటకు డబ్బుకావాలని అంటున్నారు. కాని రాజ కీయాలు ప్రధానం అవుతున్నాయేమో అని మాకు భయంగానున్నది అట్లు లేనిచో వెంటనే separate చేయమని కోరుతున్నాను.

17th March 1956] [Sri Vavilala Gopalakrishnayya]

కొత్తగా జైల్సు కట్టడం చాలా కష్టము అంటున్నారు. నిజమే. ప్రస్తుతం గుంటూరులో ఎక్కువగా crime ఉన్నది. శిక్షితులను ఎక్కడకో పంపించే బదులు గుంటూరులోనే కొత్త సబ్ జైలును కట్టితే బాగుంటుంది. ఆ విధంగా చేస్తారని ఆశిస్తున్నాను. Meeting పెట్టుకొనుటకు అనుమతి ఇచ్చే అధికారం పోలీసులకు ఇచ్చారు. అది ఆ విధంగానే ఉండాలంటే ఉంచండి. నాకేమీ అభ్యంతరము లేదు కాని ఒక విషయం చెబుతాను. నేను నా నియోజకవర్గం అంతా తిరిగిన తరువాత సత్తెనపల్లిలో meeting పెట్ట దలచుకున్నాను. 9 వ తేదీన meeting జరగాలి అనగా ఒకటవ తేదీనే అర్జీపెట్టాను. రు. 2-8-0 కూడా కట్టినాను. 9 వ తేదీ వచ్చినా ఆర్డరుమట్టుకు రాలేదు. D S. P. Camp వెళ్ళాడు ఆయన వచ్చిన తరువాత Dy. S P. నుంచి ఆర్డరు రావాలి. దీనివల్ల చాలా ఆలశ్యము జరుగుతోంది. కనీసం Sub-Inspector కు అయినా ఆర్డర్సు ఇచ్చే అధికారము ఇస్తే బాగుంటుంది. నేను సభ జరుపుకోవచ్చునా లేదా అని Sub-Inspector గారిని అడుగగా మీరు సభ జరుపుకోండి మిమ్మలను మేము అభ్యంతర పరచదలచుకోలేదని తరువాత Sub-Inspector చెప్పారు. మీరు అప్లికేషను ఇచ్చారు కనక చాలు అన్నారు. వారు ఆ ముక్క అనకుండానే అప్లికేషను ఇచ్చాను గదా అని సభ పెట్టుకుంటే నన్ను అరెస్టు చేసినట్లయితే ఇదంతా పెద్ద చిక్కు సమస్య అయిపోతుంది. అసెంబ్లీ మెంబరును అరెస్టు చేశారని అందరూ గోలపెట్టి ఆందోళనలుకూడా జరపడం జరుగుతుంది. పర్మీషను లేకుండా పెట్టినందుకు అరెస్టుచేశారు. M L. A అయినాసరే మంత్రి అయినాసరే ఆ మాట వారికి వర్తిస్తుంది. అందుకల్ల ఇటువంటి సమస్యలన్నీ పరిష్కారము చేసి శ్రేయో రాజ్యాన్ని నెలకొల్ప వలసిందని కోరుతున్నాను.

Sri PILLALAMARRI VENKATESWARLU :— అధ్యక్షా, ఈ డిమాండుమీద న్యాయవాది వృత్తిలో ఉన్నటువంటి అనేక మందిసభ్యులు అనేక సూచనలు చేశారు నేను అలాంటి సూచనలలోకి వెళ్ళదలచలేదు.

Judiciary ను తప్పకుండా separate చేయాలని, అందరూకూడా ఒప్పుకున్నారు. సంజీవరెడ్డిగారు కూడా చేస్తాము అని చెప్పారు. ఇంకా కృష్ణా, గుంటూరు తూర్పుగోదావరి జిల్లాలలో separate చేయవలసి ఉన్నది. వాటిని చట్టములేకుండానే వెంటనే చేయడానికి పూనుకున్నట్లయితే చాలా బాగుంటుందని మేము మనవి చెస్తున్నాము. ఇప్పటికి కొన్ని కొన్నిచోట్ల Judiciary మీద Executive interference కూడా కన్పించుతున్నది అది లేకుండా చేయడానికి ఈ separation అనేది ఎక్కువగా ఉపయోగపడుతుంది అనుకొంటాను, అందువల్ల తప్పకుండా వీటిని separate చేయాలని కోరుతున్నాను. దీనికొఱకు ఈ Budget లో ఏమీ కేటాయించలేదు. సప్లిమెంటరీ బడ్జెటులో అయినా ఏదైనా కేటాయిస్తే చాలా సంతోషిస్తాము.

నందిగామలో మునసబుకోర్టు కావాలనే సమస్య చాలా కాలంనుంచి ఆందోళనకరమైన సమస్యగా ఏర్పడింది. మునగాల పరగణానుంచి 80 మైళ్లు ప్రయాణముచేసి వారు బెజవాడ కోర్టుకు రావలసిఉన్నది. ఆ కోర్టుకు కేసులు సరిపోయినన్నీ వస్తాయో లేదో పరిశీలించాలన్నారు. అదేవిధంగా నూజివీడులో మునసబుకోర్టు కావాలని ఆందోళన చేసిన ఫలితంగా అక్కడ పెట్టారు. పూర్వము నందిగామలో మునసబుకోర్టు ఉన్నది.

ఎందువల్లో దానిని ఏకాఏకి తీసివేశారు. అక్కడకు కేసులు ఎక్కువగా రాకపోయి నప్పటికి, ఎక్కువ దూరాన్ని దృష్టిలో పెట్టుకొని తప్పక ఏర్పాటు చేయాలని కోరుతున్నాను నందిగామలో అని గాకుండా ఆ చుట్టుప్రక్కల ప్రభుత్వానికి ఎక్కడ వీలైతే అక్కడ పెట్టాలని కోరుతున్నాను. ఆ కోర్టుకు కేసులు సరిపోతాయని హామీ యివ్వగలము. బెజవాడలో కొంతమంది ప్లీడర్లను అడుగగా నందిగామ ఏరియాలో మునసబు కోర్టు పెడితే దానికి సరిపోయినన్ని కేసులు అక్కడ ఉన్నాయని చెబుతున్నారు. కాబట్టి అక్కడ వెంటనే మునసబుకోర్టు ఏర్పాటు చేయవలసిందిగా కోరుతున్నాను.

మునసబుకోర్టులు చాలా దూరముగా వుండుటవలన ప్రయాణపు ఖర్చులకు ఎక్కువగా డబ్బు వృథా అయిపోతున్నది. ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకొని మునసబు కోర్టులను యేర్పాటుచేయాలని మంత్రిగారికి మనవిచేయుచున్నాను. Sub Jail, Central Jail మన రాష్ట్రంలో వుంటే ఖైదీలు దూరము పోవలసిన అవసరముండదు అనుకొంటున్నాను మనం 2, 3 వందల ఖైదీలను మనం అనవసరంగా అక్కడ కూర్చోబెట్టుట వలన ప్రభుత్వానికి దండుగ తప్ప లాభంలేదు అక్కడి ఖైదీలయొక్క శ్రమ మన సమాజానికి ఉపయోగపడేటట్లుగా చూడవలసియున్నది. ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకొని ఈ Jail Reforms తీసుకురావలసిన అవసరమున్నది. చాలాకాలం క్రిందట బ్రిటిష్‌వారు దేశమంతా కూడా వారికి వ్యతిరేకంగా వున్న సమయంలో గోడలుకట్టి, కిటికీలులేకుండా Cells వంటివి తయారుచేసినారు ఈనాడుకూడా ఖైదీలను అటువంటి Cells లోనే వుంచవలసిన అవసరంలేదు. పోనీ ఒకరో, ఇద్దరో పారిపోతారేమో అంటే వారు పారిపోయి ప్రత్యేకంగాచేసేది ఏమీ లేదు. ఆ ఒకరి, ఇద్దరికోసమని మిగిలిన ఖైదీలందరిని ఆ Cells లో పెట్టవలసిన అవసరంలేదు. అయితే serious cases లోను, Murder cases లోనూ వేరే కఠినమైనవిధానం అవలంభిస్తే అవలంభించవచ్చును. 6, 7, 9 నెలల శిక్షపడిన కొంతమంది ఖైదీలుఉంటారు. అటువంటివారికి మరియొక విధానం అవలంభించాలి. వాళ్ళ యొక్క శ్రమను సమాజానికి వినియోగ పడేటట్లుచేయాలి ఏ ప్రాజెక్టు area లోనో వారిచేత పనిచేయించినట్లయితే ప్రభుత్వానికి కొంతవరకు ఖర్చుతగ్గడానికి అవకాశం ఉంటుందనుకుంటున్నాను. Jail reforms apply చేసినట్లయితే ప్రభుత్వాదాయం పెరుగుతుంది. నందికొండ ప్రాజెక్టు area లో మనకు కాయకష్టం చేసేప్రజలు చాలా అవసరం. ఇప్పుడు జైలులోవున్న ఖైదీలచేత ఉపయోగకరమయిన పనులు చేయించు కొనుటలేదు. ఏవో చిన్నచిన్న పనులు చేయించుకొంటున్నాము. ఇందువల్ల ప్రభుత్వానికి డబ్బురాదుగ. వాళ్లశ్రమకుకూడా తగినఫలితంలేదు. అలాకాకుండా ఏ నందికొండ area లోనో వారికి పనికల్పించినట్లయితే ప్రభుత్వానికి ఉపయోగకరంగా ఉంటుంది. ఈ విధంగా మన సమాజానికి అంతకు ఉపయోగకరంగా వుండేటట్లుగా ఈ Jail Reforms తీసుకురావలసినదని సూచిస్తున్నాను. ఆ ఖైదీలను Perol యిచ్చి పంపించినట్లయితే వారు మళ్లీ తిరిగి రమ్మన్నప్పుడువస్తారు వారిలోని బీదవారికి Perol యిచ్చినపుడు ప్రభుత్వమే డబ్బు ఇవ్వాలి. డబ్బు ఉన్నవాళ్లయితే వారి స్వంతడబ్బు పెట్టుకొని వెళ్ళి రమ్మన్నప్పుడు వస్తారు బీడీలు, సిగరెట్లు అలవాటున్నవారు కాల్చకుండా ఉండుట కష్టము. జైలులోవారు బీడీలు కాల్చుకొనుటకు అవకాశం కలగ జేయాలని కోరుతున్నాను. ఈ విషయాలనన్నింటిని ఆలోచించాలని మంత్రిగారి దృష్టికి తీసుకొని

17th March 1956] [Sri Pillalamarri Venkateswarlu]

వస్తున్నాను. Habitual Offenders Act వల్ల చాలా ఘోరమయిన అన్యాయములు జరుగుచున్నవి దీనివల్ల ఎరుకలవాళ్ళను, ఏనాదులను అరెస్టు చేయడం జరుగుచున్నది. దీనిని గురించి ముఖ్యమంత్రిగారికి కూడా petitions పెట్టుకోవడం జరిగింది ఎరుకల వాళ్లు అర్ధరాత్రివేళ నిద్రించు సమయంలో Sub-Inspectors మిగతా police staff వెళ్లి వారిని అరెస్టుచేసి తీసుకొని వచ్చి నానా అగచాట్లు పెడుతున్నారు. ఈ విధంగా జరుగుతోన్నదని అనేక పర్యాయములు మంత్రివర్గం యొక్క దృష్టికి తీసుకొని వచ్చాను. అందువల్ల దీనిలో political consideration అనేది లేనేలేదు నిద్రలో వున్న వారిని అరెస్టుచేసి 4,5 రూపాయలు లంచములు పుచ్చుకునే సందర్భాలు కూడా కొన్ని ఉన్నాయి. పోలీసులలో ఇప్పుడు కొంత మార్పువచ్చింది. ఇంకా మార్పు రాగలదని ఆశిస్తున్నాను. కాని ఇప్పుడు ఏ పరిస్థితులవల్ల ఇటువంటివన్నీ జరుగుచున్నవో తెలుసుకొని వాటన్నింటిని అరికట్టవలసిన అవసరం ఉన్నది మా నియోజకవర్గంలో ఒకనిమీద ఇప్పటికింకా Habitual Offenders Act క్రింద కేసు ఉన్నది. అతనింటికి పోలీసువారు వెళ్ళి నువ్వు వున్నావా ? లేదా ? అని అడుగుతారు. అసలు ఈ Act ను రద్దుచేస్తే బాగుంటుందేమో అనుకుంటున్నాను. లేనిచో కనీసం harassment తగ్గించుటకు ప్రయత్నిం చేయాలని విన్నవించు కొంటున్నాను. పోలీసు వారిలోనే కాకుండా మనందరిలోనూ కూడ మార్పు రావలసి వుంటుందేమో. మనం Police Department తో జోక్యం కల్గించుకోకుండా వుంటే ఏ విధంగా ఉంటుందో మనంతట మనమే పరీక్ష చేసుకుంటే బాగుంటుంది" అనుకుంటున్నాను. ఎవరో, ఎక్కడో లూటీ చేశారని, వారు కమ్యూనిస్టులని అమ్మన్నరాజాగారు చెబుతున్నారు ఇది కమ్యూనిస్టుల పద్ధతికాదు. గబాలున ఎవడిదగ్గరకో పోయి నీవు ఈ పని చేశావా ? లేదా ? అని బెదిరించి అరెస్టుచేసి, 107 వ సెక్షను క్రింద తప్పుడు కేసులు పెట్టుట న్యాయమా ? అని అడుగుతున్నారు అసలు M L A లు వారి దగ్గరకు ఎందుకు వెళ్ళాలి ? Police Department ఉంది. దానిపని అది చూచుకొంటుంది ఏదో కేసులు పెడతారు కోర్టులో విచారణ జరుగుతుంది. మనకు M L A పదవి వచ్చింది కదాయని పోలీసుస్టేషనుల చుట్టూ తిరుగుతూ కేసులు పెట్టేవరకు వారిని వదలకుండా ఉన్నట్లయితే ఆ పోలీసులు "నేను ఫలానా M. L. A గారితో కూర్చుని మాట్లాడినాను. వారితో కాఫీ త్రాగినాను" అని చెప్పుకుంటూ వారి duty ని సక్రమంగా నిర్వర్తించరు. ఈ విధంగా చేస్తోంటే ఎంతచెడ్డగా పరిణమిస్తుందో ఆలోచించాలి.

Srimathi Ch AMMANNA RAJA:— వారు ఎవరిని గురించి చెబుతున్నారో గాని నాపేరు చెప్పి నేను తిరిగానని అంటున్నారు. నాకు ఎప్పుడూ అలాంటి అలవాటులేదు ఇంతవరకు ఏమి జరిగిందో నాకు తెలియదని ప్రభుత్వానికి చెప్పినాను.

Sri PILLALAMARRI VENKATESWARLU — M L A. లంటే వారు ఒక్కరే కాదుగా ! నేనుకూడా ఉన్నాను. అందువల్ల మనం దానిని చాలా serious గా ఆలోచించాలని చెబుతున్నాను. చల్లపల్లి జమీందారీ area లో ఇలాంటి reforms రాబోతున్నాయనే కారణంవల్ల నయితేనేమి ఈనాడు చాలామందిమీద 107 సెక్షను ఉన్నది. Reports ఉన్నాయి. సంజీవరెడ్డిగారు దానిని గురించి ఆలోచించాలని అక్కడకు పోయి పరిశీలించాలని, ఎలాంటి వారిమీద, ఎటువంటి సందర్భాలలో కేసులు పెడుతున్నారో కొంచెం record పరిశీలించాలని విజ్ఞప్తి చేయుచున్నాను.

Police Department లో ఉండే అవినీతిని తొలగించుటకు ప్రభుత్వం పూను కోవాలని మనవి చేయుచున్నాను. ఖూనీలు చేసినవారిని పట్టుకొని కఠినంగా శిక్షించండి. అందరూ అంగీకరిస్తారు ఖూనీలు ఒకరుచేస్తే ఇంకొకరిని శిక్షించుటకు ప్రయత్నములు జరుగుచున్నవి జగ్గయ్యపేటలో కొంతమందిమీద 107 వ సెక్షను పెట్టినారు. వారు 50 మైళ్ళ దూరంలో ఉన్న బెజవాడ వెళ్ళాలి. ఒకేసారి 10,25 మందిమీద కేసులు పెడుతూ ఉంటారు. తడవకు 2,3 వందల రూపాయలు ఖర్చవుతూ ఉంటుంది.

అందువల్ల M L. A లు పోలీసు శాఖతో జోక్యం కలిగించుకొనకుండా వారికి ఉన్నటువంటి విధులను సక్రమంగా నెరవేరిస్తే చాలునని మంత్రివర్గంవారి దృష్టికి తీసుకొనివస్తున్నాను. ఈ విషయమును గురించి ఉప ముఖ్యమంత్రిగారికి ఒక petition పెట్టుకోవడం జరిగింది. వారు దానిని గురించి ఆలోచిస్తున్నారనుకొంటాను. దాచేపల్లి ఖూనీకేసు విషయంలో Lower Court, District Court లలో ఒక Head Constable మీద strictures ఉన్నవి. ఈనాడు ఆ Head Constable, Sub-Inspector గా promote అయి ఉన్నాడు. Pass చేసిన strictures మంత్రిగారి దృష్టికి తీసుకొని వస్తున్నాను. వినమని కోరుచున్నాను.

(" Regarding evidence of Head Constable, P. W. 14, it is to be noted that the committing Magistrate in page 15 of the committal order . .. ... "

Mr. SPEAKER :— No. The hon. Member is not allowed to read

Sri PILLALAMARRI VENKATESWARLU — Just one word from the copy of the judgment.

Mr SPEAKER :— Judgment copy or book, it cannot be read The rules do not allow it. You cannot read it. You can give the substance of it.

Sri PILLALAMARRI VENKATESWARLU :— ఆ Head Constable మీద చర్యతీసుకొనుటకు మారుగా promote చేయడం జరిగింది. ఇదంతా ఒక పార్టీకి సంబంధించినదని నేను చెప్పుటలేదు. అది ఏవిధంగా జరిగిందో మనకు తెలియదు. కాని మొత్తంమీద చూచినట్లయితే District Sessions Courts లో strictures pass చేసినటువంటి వాళ్లుకూడా punishment తప్పించుకోవడం జరిగింది. దీనిని దృష్టిలో పెట్టుకొని వాటిని విచారణ చేయవలసిన అవసరం ఉన్నదని మంత్రిగారికి తెలియజేస్తున్నాను.

Prohibition Department ని గురించి తీసుకున్నట్లయితే "మీరు కల్లు గీసేవారిని ఎవరినైనా పట్టియిచ్చారా ?" అని కొంతమంది అడుగుతున్నారు. ఎవరు పట్టి యిచ్చినప్పటికీ కూడా Prohibition పోయే పరిస్థితులు లేవు. M. L A. లు ఇది ఒక పనిగా పెట్టకొని పూనుకుంటున్నారంటే కేవలం కమ్యూనిస్టులమీద నింద వేసే ధోరణిలోనే ఉన్నది కాని వారు పట్టి ఇస్తున్నారా ? అని అడుగుతున్నాను.

17th March 1956] [Sri Pillalamarri Venkateswarlu]

ఇది సాధించ గలుగుతామనే విశ్వాసం మాకు లేదని మేము బహిరంగముగా చెబుతున్నాము. దీనివల్ల హైదరాబాద్ రాష్ట్రంలో 8 కోట్ల రూ॥ల వరకు ఆదాయం వస్తోందంటున్నారు. మన రాష్ట్రంలో ఇది లంచాల క్రింద పోతోంది. మనం కూడా ఈ Act ను అమలు పరచకుండా ఉన్నట్లయితే మన ప్రభుత్వానికి డబ్బు వస్తుందని నేను చెపుతున్నాను.

Prohibition department ను పోలీసు వారికి అప్పగించినందువల్ల harassment ఇంకా ఎక్కువ జరిగితే జరగవచ్చు కాని Prohibition సక్రమంగా అమలు జరుగుతుందనే విశ్వాసంలేదు. అందువల్ల తిరిగి ఆలోచించవలసిందని కోరుతున్నాను. Arms Act ఉన్నది. అందరికి Arms ఇవ్వమనికాదు. అవసరమైన వాళ్లకు ఇవ్వదలచుకొన్న వాళ్లకు ప్రభుత్వము ఇదివరకే ఇచ్చింది. దీనినిగురించి Election సందర్భములో కొన్ని కేసులుపెట్టి వాళ్ళకున్నటువంటి పిట్టలనుకొట్టే తుపాకిలనుకూడా లాక్కోవటం జరిగింది. పిట్టలను కొట్టుకొని జీవించేటటువంటివాళ్ళు వాళ్లెప్పుడుగూడా మనుష్యులమీద ప్రయోగించలేదు. ఇటువంటివారి తుపాకీలు లాక్కోవటం జరిగింది. పెద్ద పెద్ద భూస్వాములకు, అవసరమైనవాళ్ళకు ప్రాణ సంరక్షణార్థము తుపాకులు ఇచ్చారు. పిట్టలను కొట్టుకొని అదేవృత్తిగా జీవించే వాళ్ళ దగ్గరనుంచి లాక్కోవటం జరిగింది. కాబట్టి తీసుకున్న తుపాకులను వాపసు చేయమని కోరుతున్నాను. Firestations గురించికూడా చెప్పారు. అసలు Budget ను frame చేసేటప్పుడే ప్రజలయొక్క అవసరాలను తీర్చడానికి ధైర్యంగా, సాహసంగా ముందుకు పోయే Budget ను తయారుచేయాల్లేదు. Fire stations పెట్టడానికి కావలసిన డబ్బుకొరకు కేంద్రప్రభుత్వము మీదనో ఇంకెవ్వరి మీదనో ఒకరి మీద ఒత్తిడి తీసుకువచ్చేటట్లుగా ఉండాలి. ద్వితీయ పంచవర్షప్రణాళిక కాలములో నైనా అన్ని ప్రాంతాలలోను Fire stations ను ఏర్పాటు చేసుకోవలసివున్నవి. అయితే Government of India వాళ్ళు Fire stations అవసరంలేదని అనుకొన్నట్లు కన్పిస్తున్నది. ఇందుకై ప్రణాళికలో డబ్బు కేటాయించలేదు. ఎందుకు పనికి రానటువంటి పాతఇంజన్లు మనకు ఉన్నాయి. ముఖ్యంగా మా ప్రాంతంలో గుడిసెలు, తాటాకుఇండ్లు ఎక్కువగా ఉన్నాయి. ఎండాకాలము వచ్చేటప్పటికి అవి తగలబడడం చేత ప్రమాదాలు చాలా జాస్తిగా ఉంటూఉంటాయి. అందువల్ల Fire stations ఎక్కువగా ఉండాలి. Fire stations సంఖ్య ఎంతపెరిగితే అంత బాగుంటుంది. ఆ విధంగా చేయాలని నేను కోరుతున్నాను. Police వారి allowance గురించి కూడా చాలామంది చెప్పారు. దానిని నేనుకూడా endorse చేస్తున్నాను. ఈనాడు వారికి రోజుకు రు 0-12-0 లు భత్యం ఇస్తున్నారు. సంజీవరెడ్డిగారుకూడా ఎక్కువ చేయాల్సిన అవసరం ఉన్నదని, చెయ్యలేకపోతున్నందుకు బాధపడుతున్నామని చెప్పారు. కేవలం బాధపడితే సరిపోదు. పోలీసులకు చాలినంత భత్యం ఇవ్వటానికి మార్గాలు అన్వేషించవలసి ఉంది. కనీసం రెండుపూటల భోజనానికి సరిపోయేటట్లుగా బత్తాను ఎక్కువచేస్తే బావుంటుంది. ప్రభుత్వమే వారికి భోజనము పెట్టే ఏర్పాటు చేసినా మాకేమి అభ్యంతరం ఉండదు. కొన్నిమైళ్ల దూరంనుంచి వారిని తీసుకొచ్చి వారిని ఇబ్బందులకు గురిచెయ్యడం మంచిదికాదేమో ననుకొంటాను. ఇప్పుడు ఇక్కడ ఉన్నటువంటి Police reporters జీతాలు కూడా

తక్కువే. వాళ్లకు అక్కడ 80 రూపాయలు ఇస్తున్నారు. ఇక్కడున్నటువంటి reporters కు 200 రూపాయల నుంచి ఇస్తున్నారు. వారిచేత వీరిచేత ఒకే విధమైనటువంటి పనిని చేయిస్తున్నారు. అవసరమైనప్పుడు వారిని ఇక్కడికి తీసుకు వచ్చినపుడు వారికి కూడా మన reporters తో సమానమైన జీతాలు ఇప్పిస్తే బాగుంటుంది. కనుక పైది కూడా తప్పకుండా ఆలోచించాల్సిన విషయము. చివరకు జీతాలు ఎక్కువ వేయమని, పన్నులు వేయవద్దని కేవలం కమ్యూనిస్టు వాళ్ళే చెప్పుతారు అనేదికాకుండా కాశేశ్వరరావుగారు మొదలియారుగారు కూడా వీరి విషయంలో చూడాలనే చెప్పినారు. వారు చాలా పెద్దవారు, తొందరపడి ఏమాట చెప్పేటటువంటివారు కాదు. అలాంటివారు కూడా చెప్పారు. అందువల్ల దీనిని కూడా consider చేయాలని కోరుతున్నాను. పోలీసువాళ్లకు ఇళ్లు కట్టించాల్సిన అవసరం ఉన్నదనికూడా సూచిస్తున్నాము. వచ్చే సంవత్సరం విశాలాంధ్ర Budget లో చర్చించుకొనే టప్పుడు ఈ లోపాలు లేకుండా Police department విషయమై శ్రద్ధ తీసుకుంటారని ఆశిస్తున్నాను.

The Hon Sri N. SANJEEVA REDDI :— అధ్యక్షా! నేను ఎక్కువసేపు సమాధానం చెప్పాల్సిన అవసరం కలగనందుకు చాల సంతోషిస్తున్నాను. సత్యనారాయణరాజుగారు తప్ప మిగిలినవారంతా కూడా నేను ప్రత్యుత్తరము చెప్పుటకు అవసరములేని పరిస్థితులే కల్పించారు ఇచ్చిన సలహాలైనా constructive గానే ఉన్నాయి. సత్యనారాయణరాజుగారికి కోపము ఉండడానికి కారణం లేకపోలేదు. అది నాకు తెలుసు ఆయన్ని కూడా arrest చేసి ఒకరోజు జైల్లో పెట్టారనుకుంటాను. వారంతమాత్రమైన కోపపడడంలో తప్పేమి లేదనుకొంటాను. ప్రభుత్వముయొక్క point of view అర్థం చేసుకోలేని పరిస్థితులు ఉండడానికి కారణం లేకపోలేదు. జవహార్‌లాల్ నెహ్రూగారికి ప్రజల విషయంగాని, ప్రభుత్వ విషయంగాని చెబుతాము అంటే మేము వద్దనలేదు. మేము మా యిష్టమువచ్చిన చోట చెప్పుతాము అన్నారు. నందికొండ ప్రాజెక్టు నాగార్జునసాగర్‌కు పునాదులు వేస్తామని శాసనసభ్యులుగా ఆహ్వానించారు. ఎవరైన పెళ్ళికి ఆహ్వానిస్తే నేను వస్తాను, నాపిల్లిని గూడ చంకలో పెట్టుకొని తీసుకొనివస్తాను అని అనడం న్యాయంకాదు. పెళ్ళిలో పిల్లులు అవి కనబడడం మంచిది కాదు. అవి అశుభం అందుచేత పిల్లులు వద్దు మీరురండి పెళ్లికి అంటే లేదు నా పిల్లితో నేను వస్తాను అంటే వద్దని చెప్పాము. అంతే తేడా ఉన్నది ఇక్కడగూడా. వారి పార్టీవారు గాని, వారుగాని నెహ్రూగారితో ఏమీ చెప్పగూడదని కాదు. ఏమని చెప్పుతారు? ఏమని చెప్పగలుగుతారు?

Sri M. SATYANARAYANA RAJU :— తమ దృష్టిలో అది పిల్లిని చంకబెట్టుకొని వచ్చినట్లవుతుంది. గాని మాదృష్టిలో అదిగాదు. ప్రజల శ్రేయస్సు కోసం చేస్తామనే గాని, అశుభంకోసంగాదు.

The Hon. Sri N. SANJEEVA REDDI :— అందుకే దృక్పథంలో మార్పు ఉన్నదని చెప్పాను. జవహరలాల్ నెహ్రూగారికి చెప్పడమే మీకు ముఖ్యమైతే పరిస్థితులు వారి దృష్టికి తీసుకురావడమే మీ ఆశయమైతే రహస్యంగా ఎందుకు మాచెవిలో వేలకొలది ప్రజల కెదురుగా చెప్పమన్నాము? అందుకు కమ్యూనిస్టు మిత్రులంపెరు అంగీకరించారు. జవహర్‌లాల్ నెహ్రూ ప్రజల మనిషి. ఆయన ఎక్కడ దిగితే

అక్కడ లక్షలాది ప్రజలు ఉంటారు. వారందరితోను చేరి చెప్పుచున్నాము దానికి మీరు ఎందుకంగీకరించలేదో నా కర్థంకావడంలేదు. అర్థంచేసికోలేనందుకు విచారపడు తున్నాను కడపటి నిమిషంలో, విధిలేక అతికష్టంతో, మనస్సులో ఎంతో బాధ పడుతూ arrest చేసినాము. తోటి శాసనసభ్యులు 10 మందిని, అందరు విశాఖ పట్టణంనుంచి గుంటూరు వరకు వచ్చి అక్కడనుంచి మాచెర్లకు పోతూ ఉంటే తీసుకు పోయి వినుకొండలో పెట్టాల్సిన దౌర్భాగ్యం మాకు కలిగిందనే విచారపడ్డాము. దానిని ఇక మరచిపోండని కోరుతున్నాను. వేమయ్యగారు, అయ్యపురెడ్డిగారు, బాసిరెడ్డిగారు మొదలయిన మిత్రులంతా చాల constructive గా సలహా ఇచ్చారు Sub-jails విషయంలో చాలా అసంతృప్తికరంగా ఉన్నదని చెప్పారు M L. A. లు అందరూ Sub-jail visitors గనుక ఏమైన అవకతవకలు ఉంటే కేవలం Budget నాడే చెప్పకుండా అప్పటికప్పుడే ప్రభుత్వం దృష్టికి తీసుకువస్తే ఏమైన individual cases mark చేయడానికి అవకాశం ఉంటుందేమో ? వెంకటేశ్వర్లుగారు చెప్పారు. Sub-jails అన్నీ పూర్వం కట్టినవేనని, దానిలో ventilation ఉండాలని, back yard ఉండాలని చెప్పారు. అవి అంతా చేయడానికి ఎంత అవుతుందో లెక్కవేశారా అంటే లేదు. మన Budget demand అంతా 25 కోట్లు. అది అంతాకూడా Sub-jails construction కు సరిపోతుంది. కాబట్టి వాటిని ఉన్న పరిస్థితిలోనే బాగు పర్చడానికి మార్గాలు సూచిస్తే తప్పకుండా మారుస్తాము. Building బాగా లేదని, windows లేవని flushout latrines లేవని మాకు తెలుసు. కాని వాటన్నిటిని ఎప్పటికి ఏర్పరుస్తామో తెలుసుకోవడం కష్టంగానే ఉంటుంది. Sub-jails పరిస్థితి happy గా లేదని మనకందరికి తెలుసు. మనంకూడా అప్పుడప్పుడు sub-jails లో ఉన్నవాళ్ళమే. వాటిని ఎట్లా మార్చాలో తెలియక బాధపడు చున్నాము. ఇందులో మీరు చెప్పినదానికి నేను చెప్పిన దానికి తేడా ఏమిలేదు. మార్పు చేయాలనే మేము కూడా కోరుతున్నాము. మొట్ట మొదట Court ల విషయం గురించి Senior advocates ముగ్గురు బాసిరెడ్డిగారు, అయ్యపురెడ్డిగారు, మొదలియారుగారు Additional Session Court వగైరాలను గురించి మాట్లాడారు. ఇప్పుడు వారు చెప్పిన విషయాలన్నీ కూడా రాత్రి file లో చదివినందువల్ల వాటి నన్నిటిని నేను అంగీకరించాను. Additional District Judges ను వేయాలని కోర్టుల పరిస్థితి బాగు పర్చాలని మా దృష్టిలో ఉన్నది. దానికి తగినచర్య తీసుకొంటు న్నాము. Buildings, furniture, library మొదలైన వాటన్నిటిని improve చేయాలి అంటున్నారు. ఎప్పుడు మన ఆర్థికపరిస్థితులు బాగుపడతాయో, ఎప్పుడు ఇవన్నీ చేయగలుగుతామో ధైర్యంగా చెప్పలేకపోతున్నాము. వకీళ్ళయొక్క పంచెల్లూ పంట్లాములు చిరిగి పోతున్నాయని బాసిరెడ్డిగారు అన్నారు. దీనిని బాగుపరచాలని ఉంటే ప్రతిఒక్క వకీలు కూడా తన కుర్చీని తానే తెచ్చుకొని వేసుకొంటే బాగుంటుందేమో ననిపిస్తోంది. Emblem ఎందుకు మార్చలేదు ? ఇంకా మద్రాసు emblem ఉన్నదని బాసిరెడ్డిగారు అడుగుతున్నారు ఇవ్వాళ మనం అసందిగ్ధస్థితిలో ఉన్నాము. ఆంధ్ర రాష్ట్రం వచ్చిన రెండున్నర సంవత్సరాలనుంచి మద్రాసు emblem నే కోర్టులలో పెట్టుకొంటున్నాము. ఇప్పుడు emblem ను మారిస్తే మరల విశాలాంధ్ర వచ్చిన తరువాత మళ్ళీ emblem ను మార్చవలసి వస్తుంది. అందువలన 3, 4 నెలలో

విశాలాంధ్ర ఏర్పడుతున్నది గనుక అప్పుడు emblem ను మార్చడానికి ప్రయత్నము చేస్తాము.

ఇక అచ్యుతరెడ్డిగారు High Court గురించి మాట్లాడారు Separate High Courts, Benches ఉంటాయని వింటున్నాము, ఆ విధంగా ఉండ కూడదు, ఒకే High Court ఉండాలి అన్నారు. నేను ఈ విషయంలో సంపూర్ణంగా వారితో ఏకీభవిస్తున్నాను. వారుచెప్పిన అభిప్రాయాన్నే నేను ఢిల్లీలో వెల్లడించాను. హైదరాబాదు మిత్రులకుకూడ చెప్పాను. రెండు High Courts, Benches ఉండడం మంచిదికాదు. పెట్టుకొంటే హైదరాబాదులోనే High Court పెట్టుకొండి, లేదా మా గుంటూరులోనె ఉండనివ్వండి, అంతేగాని దీనిని రెండుగా చీల్చవద్దండి, మీ లాయర్స్ గాని, మా లాయర్స్ గాని అక్కడ కొందరు, ఇక్కడ కొందరు, వారములో అక్కడ 3 రోజులు, ఇక్కడ 4 రోజులు ఉండడం బాగుండదని, మీకు High Court హైదరాబాదులోనే ఉండాలంటె అక్కడనే పెట్టుకోండి, రెండుగా మాత్రము ఉండనివ్వద్దండి అని హైదరాబాదు మిత్రులకు చెప్పాను ఢిల్లీలో Home Department వారికికూడ చెప్పాను. నాకు తెలిసినంత వరకు రేపురాబోయే బిల్లులో High Court ఇక్కడైనా ఉండాలి, లేదా అక్కడైనా ఉండాలని ఉంటుంది. అది మనకే వదలిపెడతారు. In consultation with the High Court, the Governor will recommend to the President, మనము ఆంధ్రరాష్ట్రము వచ్చినప్పుడు High Court పెట్టుకొన్నాము కదా! అప్పుడు Andhra Bill లో ఆవిషయమై ఏమీ లేదు. మనకే అధికారమిచ్చారు అప్పుడు Legislature ద్వారా ఆ అధికారాన్ని పురస్కరించుకొని మనమే ఏర్పాటు చేసుకొన్నాము In consultation with the High Court, we decided that the seat of the High Court will be at Guntur In a similar way, I hope this decision also will be taken. ఇప్పుడు ఆ విషయము గురించి ఆలోచించవలసిన అవసరంలేదు రేపు States Re-organization Bill వచ్చిన తరువాత దాని విషయం ఆలోచించి ఏకగ్రీవంగా అందరము ఒకేచోట High court ఉండాలని నిశ్చయించుకోడానికి వీలవుతుందని అనుకొంటాను.

ఇక రంగనాథ మొదలియార్ గారు Assistant Public Prosecutors ను Session Courtకు పంపడం మంచిదికాదు, Additional Public Prosecutors ఉంటే మంచిదని చెప్పారు. Except in these four Rayalaseema Districts i e, Kurnool, Cuddapah, Anantapur, and Chittoor, in all the other places wherever there is a Sub-Judge, there is an additional Public Prosecutor Here also you will be glad to hear that, we are making a beginning now. One Additional Public Prosecutor is in the process of being appointed if he is not already appointed, because the file has left me already. కాబట్టి మీరు ఇచ్చిన సలహాను అప్పుడే అంగీకరించాము. ఇక తప్పకుండా ఒకటి తరువాత ఒకటి జరుగుతాయి.

అది చాలా మంచిదని నేను కూడ ఒప్పుకొంటున్నాను. ఇక Governmen Pleaders ను Public Prosecutors ను వేయడంలో కలెక్టర్లయొక్క జిల్ల Judges యొక్క recommendations ను ఎప్పుడు అంగీకరించ వలసిందని గౌర సభ్యులు సలహా ఇచ్చినందుకు చాలా సంతోషము. ఇదివరకు అట్లాగే జరుగ తున్నది. ఇదివరకు ప్రభుత్వము తరఫున కలెక్టర్లే ఏజెంట్లుగా ఉంటున్నారు. Judicia Department తరఫున జిల్లాజడ్జీలు agents గా ఉంటున్నారు. జిల్లాజడ్జీల సలహాపైన recommend చేస్తారు. వీరు ఇచ్చిన panel నుంచే ఇదివరకు వారి వేయడం జరుగుతున్నది. ఎప్పుడైనా చాలా అరుదుగా ఏవో ప్రత్యేక కారణాలవ మార్పు చేయవలసి యుంటుందేమోగాని నూటికి 99 పాళ్ళు వారుఇచ్చిన సలహా అంగీకరించడం జరుగుతూ ఉన్నది. ఇప్పటివరకు ఏమీ మార్పు జరగడంలేదు. వా సలహానే పాటించడం జరుగుతున్నది, నాకు తెలిసినంతవరకు.

ఇక Assistant Public Prosecutors యొక్క salaries గురించి Short hand Reporters యొక్క salaries గురించి రంగనాధ మొదలియార్ గారు చాలా విపులంగా చెప్పారు. Assistant Public Prosectors గురించి నేను ఈ మధ్యనే అసెంబ్లీలో ఒక ప్రశ్నకు సమాధానం చెప్పుతూ, ఇప్పుడు వెంటనే ఏమి చేయడానికి వీలులేదు, విశాలాంధ్ర ఏర్పడిన తరువాత, ఈ shape ఎట్లా ఉంటుందో చూచి మారుస్తామని చెప్పాను. ఏ కార్యక్రమం తలపెట్టదామన్నా ఇ uncertain period గా ఉన్నది. ఇంకొక ఆరునెలలలో అక్కడికి పోతున్నాము. ఇక్కడ ఈ చట్టాలు అన్వయించవలెనో, హైదరాబాదు చట్టాలు అన్వయించవలెనో తెలియదు. కనుక కొంతకాలము వేచియుంటేతప్ప మార్పులుచేయడానికి వీలులేదు ఇప్పటికి ఈ చట్టాలు అట్లనేఉంచి తరువాత మార్పులు చేసుకొంటే మంచిది. ఇప్పుడు తొందరపడి ఏమైనా మార్పుచేశాము అనుకొంటే, మరి మూడునెలలకు ఇంకోమార్పు చేయడం ఆతరువాత 3 నెలలకు మరలమార్పు చేయడంఅనేది బాగుండదు. కనుక క్రొత్తరాష్ట్రము ఏర్పడినతరువాత ఆలోచిస్తాము.

తరువాత M R. అప్పారావుగారు, అమ్మన్నరాజాగారు ఆడపోలీసులను గురించి చెప్పారు. Police Department లో కూడ ఆడపోలీసువాళ్ళుఉంటె మంచిదేమోనని అందరు అంటున్నారు. అది కొంచెము ఆలోచించవలసిన విషయము. ఆడవాళ్ళను search చేసేటప్పుడు ఆడవాళ్ళుఉంటె మంచిదన్నారు. ఆ విషయంలో ఏమి సందేహంలేదు కాని ప్రతి Police Station లోను ఆడవాళ్ళను పెడితే, ఆడవాళ్ళకు, మగవాళ్ళకు సరిసమానంగా పెట్టవలసి వస్తుందేమో, అప్పటికి ఎంత డబ్బు ఖర్చుఅవుతుందో ఆలోచించండి. పోనీ ఒక్కొక్క Station లో ఒకరిద్దరిని పెట్టినా, ఎంతో ఖర్చు అవుతుంది. ఎన్నో Police Stations ఉన్నాయి. అయినా ప్రత్యేకంగా ఆడ ఖైదీలు వచ్చినప్పుడు, ప్రత్యేకంగా వాళ్ళను చూచుకోడానికి ఆడవాళ్ళు ఉండడం మంచిది. దీనికి ఏ విధంగాచేస్తే బాగుంటుందో, ఎంత ఖర్చు అవుతుందో పరిశీలించవలసి యుంటుందని చెప్పాను. ఆడవాళ్లను appoint చేయడం మంచిదని చెప్పడానికి ప్రత్యేకంగా ఒక కమిటివేయడం అనవసరం. ఆడవాళ్లనువేయడం మంచిదని నేనే చెప్పుతున్నానుకదా డబ్బు ఎంతఅవుతుందో అనే బాధగాని, వారిని వేయటానికి ఏలాటి ఆక్షేపణలేదు తప్పకుండా ఆడవాళ్లు ఉంటేనే

మంచిది. ముఖ్యంగా ఈ civilised days లో మగవాళ్ళుపోయి ఆడవాళ్ళను పట్టుకొని చూడడంఅనేది బాగుండదని నేను అంగీకరిస్తాను.

ఇక అన్నారావుగారు మా శ్రీకాకుళం జిల్లాకు ఇంకా ఏమిచేయలేదు, District Court లేదు, D S P Office లేదు, ఇవన్నీ కూడాలేవు, కలెక్టరుఆఫీసు ఇంకా గిరాలేదు అన్నారు. Collector's office కు అంతో, ఇంతో డబ్బు sanction చేశాము అది తయారుఅవుతూంది. Police Department కూడ అక్కడకు తీసుకుపోవాలని మాకుకూడ ఆశేఉన్నది. ఎంత త్వరగా సాధ్యమైతే, ఎప్పుడుమాకు డబ్బు సమకూరతే అప్పుడు తప్పకుండా చేస్తాము.

తిరువాత విజయవాడలో enforcement of prohibition బాగా జరుగలేదని కాశీశ్వరరావుగారు అన్నారు. కాని చాలా జిల్లాలలో ఇది చాలా పట్టుదలగా enforce చేస్తున్నారని, చాలా బాగా జరుగుతున్నదని చాలా మంది చెప్పారు. ఒక బెజవాడలో మాత్రము ఎందుకు ఈరకంగా జరుగుతూందో నాకు అర్థంకాలేదు అయినా దాన్ని ప్రత్యేకంగా పరిశీలిస్తాము. దానికి తోడు వ్యభిచారము కూడ చాలా ఎక్కువగా ఉన్నదని అన్నారు. బహుశః బెజవాడ ఆంధ్రదేశానికి centre కాబట్టి అక్కడ అటువంటి పరిస్థితి ఏర్పడిందేమో ! దానికి ఏదో ఒక కారణ ముండాలి అనుకొంటాను. దానికి ప్రత్యేకమైన కారణాలేమున్నాయో పరిశీలించడానికి కాశీశ్వరరావుగారి అధ్యర్యానే ఒక కమిటీని వేస్తే వారే దానికి సలహాలిస్తారనుకొంటాను

నాగిరెడ్డిగారు Sub-jails గురించి చెప్పారు. ప్రత్యేకంగా వారు చెప్పిందేమి లేదు రాఘవులుగారు high ideals అన్నీ చెప్పారు. ఈ పరిస్థితులంతా ఎప్పుడు బాగుపడతాయో అన్నారు. మన సంఘమంతా బాగుపడిననాడు, మన ఆర్థికస్థితి బాగుపడిననాడు, తప్పకుండా Constables యొక్క పరిస్థితి బాగుపడుతుంది కాని ఈ Police వాళ్ళను recruit చేసేటప్పుడు, వారి మేధా సంపత్తి చూచి చేయవలసిందని రాఘవులు గారు అన్నారు కాని ఈ విషయం వారు మరల ఆలోచించి, కూర్మయ్య మొదలైన వారందరిని అడిగిన తిరవాత ఆ point చెప్పమని అడుగుతున్నాను. మేధా సంపత్తి చూచి recruitment చేస్తే, ఎంత మంచి హరిజనులు వచ్చినారని మీరు మరల నన్ను ప్రశ్న వేయకూడదు అప్పుడు మరల అందరూ బాధపడుతారు. అసలు మేధా సంపత్తి, intelligence, capacity అంటే దాని కేమైనా thermametre ఉన్నదా కొల్చేదానికి? కనక ఉన్న reservations తీసివేస్తే చాలా ఇబ్బందులకు గురిఅవుతాము అందుచేత, మేధా సంపత్తి ఒకటే కాదు చూడవలసినది. నిజంగా చూడవలసి వస్తే వారి భుజబలము ఇంకా తక్కినవన్నీ చూడవలసి ఉంటుంది

శ్రీనివాసరావుగారు తమ సహజమైన పాండిత్యాన్ని కవిత్వాన్ని వెల్లడిస్తూ చెప్పారు. ఇరవై ఏడేళ్ళు service ఉన్న Constable ను dissmiss చేశారని అన్నారు. చేసి ఉంటారు. నేను కాదనను. కాని 27 ఏళ్ళు ఉన్నవారు corruption practise చేయవచ్చును అని ఏమైనా rule చేస్తారా ఇకమీదట ? ఇరవై ఏడేళ్ళ తరువాత dissmiss చేయడానికి లేదు అంటె, అప్పటి నుంచి corruption practise చేయవచ్చునన్నమాట. నా దగ్గరకు ఎన్నో కేసులు వస్తూ ఉంటాయి. నేను ఒకే

17th March 1956] (Sri N Sanjeeva Reddi)

principle చెప్పాను. Corruption కేసులో dismiss అయితే ఆ petitions నా దగ్గరకు తీసుకు రావద్దండి అని. అటువంటివి తీసుకు రావడం కూడ మర్యాద కాదన్నాను. ఏదైనా technical mistake అయి ఉంటే అక్రమాలు చేసిఉంటే అటువంటి విషయాలలో ఎవరైనా గాని appeal చేసుకోవచ్చు. Constables అయినంత మాత్రాన appeal చేసుకోకూడదని కాదు. కాని corruption case అని ఒక constable ను dismiss చేసి ఉంటే అది Sub Inspector, Circle Inspector, Dy S P, D S P., D I. G, I. G, ఇంతిమంది చూచి చేసినటువంటివి ఇప్పుడు గవర్నమెంటుకు వస్తే దాని కొరకు ఎందుకు ఇంత అనవసరంగా బాధపడతారు, అటువంటి వాటిలో ఏమి చేయుటకు వీలులేదు, మిగిలిన కేసులు ఏవైనా ఉంటే తీసుకురండి అని చెప్పాను. అలాంటివి రెండు, మూడు కేసులు వచ్చినపుడు ఆంధ్ర రాష్ట్రం రాకముందు ఒక Harijan Probation Sub-Inspector యొక్క services terminate చేశారు. ఆ విషయం గురించి నాకేమి appeal గాని petition గాని రాలేదనుకోండి. ఎవరో దాన్ని నా దృష్టికి మాత్రం తెచ్చారు. అప్పుడు నేను అతని personal Register చూచాను. గుంటూరుజిల్లాజాపతు ఏవో నేరాలు ఉన్నట్లు చూచాను. అవేమి బ్రహ్మాండమైన నేరాలు కావు ఆ కాగితము సరిగా చూడలేదని ఈ కాగితము సరిగా పంపలేదని ఈ విధముగా 3, 4 నెలల లోపల అనవసరపు నేరాలు అతనిమీద పెట్టి 5 వ నెలలో అతని probation terminate చేశారు. అతన్ని రెండేళ్ళ తరువాత re-instate చేసినారు.

అదిగూడ 1954 వ సంవత్సరములో నేను పోలీసు మంత్రిగా ఉన్నప్పుడు reinstate చేయమని వేసిన ఆర్డరును, తరువాత ఆరు నెలలదాకా issue కాలేదు. నేను మరల పోలీసు మంత్రిగా వచ్చిన తరువాత ఆరు నెలల క్రిందట నేను వేసిన ఆర్డరును, issue చేయడానికి వీలుఅయింది. దీనికి అంతా కారణము ఏదో రూలు అడ్డము వచ్చిందని, ఏదో అక్కడ మద్రాసు ప్రభుత్వములో dismiss చేసిన Constable ను, ఈ ప్రభుత్వములో Sub-Inspector గా పెట్టుకోవచ్చునా, లేదా, అనేటటువంటి doubts మన Secretariat లో పరిశీలన చేస్తూ ఉండడము వల్ల, ఆ ఆర్డరు issue కాకుండా ఆలస్యము జరిగింది. అతని అదృష్టమున నేను మరల పోలీసు మంత్రిగా రావడమువల్ల ఆ ఆర్డరు issue చేయడము, అతనిని reinstate చేయడము జరిగింది. లేకపోతే ఆ కాగితములు అన్నీ బుట్టఅడుగున పడిపోయి ఉండేవే కాబట్టి యిటువంటివి ఎన్నో చూస్తున్నాము. నిజానికి నేను రాబట్టి, ఆవిషయము నాకు బాగా తెలుసును కాబట్టి అతనికి మరల ఉద్యోగము దొరికింది. నేను ఒకటే చెప్పాను Corruption అనేది తప్ప తక్కిన విషయములలో ఎక్కడైనా అక్రమాలు జరిగిఉంటే, అటువంటివి నా దృష్టికి తీసుకుని రమ్మని చెప్పాను. Sub Inspectors విషయమే కాదు అంతకు తక్కువవారు Constables విషయములో గూడ Corruption విషయములో తప్ప, తక్కినవాటిల్లో ఎక్కడైనా అక్రమము జరిగితే, తప్పకుండా నావద్దకు తీసుకుని రండి, నాకేమి అభ్యంతరము లేదు, అని చెప్పాను. కాని Corruption విషయము ఉంటే, అందులో political influences తీసుకునివచ్చి పెట్టటానికి ప్రయత్నములు ఉంటాయి. నిజానికి నేను అటువంటి వాటికి లొంగలేదు. అందుకనే నేను చెడ్డవాడిని అని అనుకుంటున్నారు అని గూడ నాకు తెలుసు. అటు

వంటివి ఎన్ని యిబ్బందులు ఉన్నా, అందులో ప్రమాదము యేమీలేదు కాబట్టి మనం వాటిని కొంతవరకు honest level లో చూస్తే తప్ప, honest గా పనిచేసే Policeman కు అది తీరని punishment అవుతుంది. చిన్న చిన్న ఉద్యోగుల విషయంలో ఆ విధంగా చేస్తున్నారని అనుకోవచ్చు. కాని ఎవరైనా వాస్తవము తెలుసుకోవాలంటే, వాటికి ప్రశ్నలు వేయండి జవాబులు చెబుతాను. Circle Inspector దగ్గరనుంచి కూడ ఎంతోమంది ఎన్నో ఏండ్ల సర్వీసు ఉన్నవారుకూడ dissmiss అయినవారు ఉన్నారు. ఎవరైనా సభ్యులు తెలుసుకోవాలంటే తెలుసుకోవచ్చును.

ఇక మన రామారెడ్డిగారు, యింకా యితరమిత్రులు, గోపాలకృష్ణయ్యగారు కూడ కొన్ని సలహాలుయిచ్చారు. అవి అన్నీ ఎంతవరకు అంగీకరించ తగినవో, పరిశీలిస్తాము. వారు చెప్పేటప్పుడు అన్నీ constructive గానే చెప్పారు. మునిసిఫ్‌కోర్టు నందిగామలో పెట్టించండి, అక్కడ ప్రజలకు చాలా యిబ్బందిగా ఉన్నది, ఎక్కడో ప్రక్కతాలూకాలకు మైళ్లకొలది పోవలసిన పరిస్థితులు ఉంటున్నవి అని మన వెంకటేశ్వర్లుగారు చెప్పారు. ఆ విధంగా ప్రతితాలూకాకు ఒకమునసబుకోర్టు పెట్టటానికి వీలుఉంటుందా? ప్రభుత్వానికి డబ్బుకావద్దా? అక్కడఉండే కేసులుగూడ తగినన్ని ఉంటాయా లేదా అనేవిషయాలు ఆలోచించవలసిఉన్నది. ఇక్కడ మా అనంతపురము, కడప, కర్నూలుజిల్లాలలో ఎక్కడెక్కడ ఎన్ని ఉన్నవో చూడండి: జిల్లాఅంతటికీ రెండేకోర్టులుఉన్న జిల్లాలు యిక్కడ ఉన్నవి. ఆ విధంగా ఉన్నప్పుడు, యిక్కడ ప్రజలుకూడా ఎన్నెన్ని మైళ్ళు పోవలసివుంటుందోగూడ ఆలోచించండి, కాబట్టి కోర్టు యొక్క work నుబట్టి కోర్టులు పెట్టాలేగాని, work తక్కువగా ఉన్నచోట పెట్టడముఎట్లా? నిజంగా ఎక్కడైనా తగినన్ని కేసులుఉంటే, కోర్టు అక్కడ తప్పకుండా పెడతాము. ఆ assurance మాత్రం నేను యిస్తున్నాను. Work ఉంది అని నిరూపణ చేసేటట్లైతే, అక్కడ కోర్టును పెట్టటానికి ఆక్షేపణ ఉండదు.

Sri V. VISWESWARA RAO :— బెజవాడలో ఆరుకోర్టులు ఉన్నవి. అటువంటివి తాలూకా Headquarters లోనైనా ఒక్కదానిని పెట్టితే, ప్రజలకు ప్రయాణాలు చేయటానికి సుళువుగా ఉంటుంది. ఖర్చులు కూడ కలిసివస్తాయిగదా? ఆ విధంగా ప్రభుత్వం ఎందుకు ఆలోచించకూడదు ?

The Hon. Sri N. SANJEEVA REDDI :— ఎవరిప్రయాణపు ఖర్చులు కలిసివస్తాయని అంటారు? బెజవాడలో ఆరుకోర్టులు పెట్టారంటే, ఒక్క బెజవాడ కేసులకోసమే ఆరుకోర్టులుకూడ అక్కడ పెట్టలేదు. ఒక్క బెజవాడకోసము ఎన్నికోర్టులు కావాలో, ఒక్కనందిగామ తాలూకాకోసము ఎన్నికావాలో, యీ విధంగా అన్ని చోట్లలోను ఎన్ని ఉంటాయో చూచుకుని, ఒకదానిలో ఎక్కువ ఉన్నను, మరొకదానిలో తక్కువగా ఉన్నను, అన్నీగూడ equal గా చూచుకోటానికి వీలుగా ఒక్కచోట పెట్టిఉంటారు అంతేగాని, ఒక్క బెజవాడలో ఆరు కోర్టులున్నమాట నిజమే. మా అనంతపురం జిల్లా చూడండి. జిల్లాకు అంతటికీ ఉన్నవి రెండే. బెజవాడలో వుండేవారు చాలా careful people. శాంతి పరులు. (Laughter) ప్రతి దానికి కోర్టుకు పోతారు. అందుకనే బెజవాడలో ఆరు కోర్టులు పెట్టారు. అనంతపురంలో రెండే పెట్టారు. అంటే వరుస proportion లో

17th March 1956] (Sri N Sanjeeva Reddi)

ఉన్నదన్నమాట. అంతేగాని బెజవాడలో ఆరుకోర్టులు పెట్టారు కాబట్టి మా అనంతపురంలో 2 కోర్టులు పెట్టారు అంటూ, అక్కడికి యిక్కడికి పోల్చుకుంటే ఎట్లా? Inspite of Venkateswarlu నందిగామ people మంచివారు అని అనుకుంటున్నాను. (Laughter) అందుకనే అక్కడ కోర్టు పెట్టలేదని అనుకోండి కాని Statistics ను బట్టి అందరి పరిశీలనలను బట్టి అక్కడ నందిగామలో పెట్టితే నష్టము కాదు. నిజంగా కోర్టు అక్కడ అవసరమేనని రుజువు అయితే తప్పకుండ పెట్టవచ్చు. ప్రజలకు అనుకూలముగా ఉంటుంది అంటే ప్రభుత్వము మాత్రము అభ్యంతరము పెట్టదని మాత్రము చెబుతున్నాను.

ఇకపోతే convicts కు కొన్ని privileges యివ్వాలి. వారికి బీడీలు వగైరాలు యివ్వాలి అని కొందరు చెప్పారు. చూస్తాము. అవిఅన్నింటినీ గురించి ఆలోచించుదాము. Privileges యివ్వడము మంచిదే. నాకు కూడ అటువంటి ideas వున్నవి. ఇంకా వారికి ఏదో Agricultural colony ఒకటి ఏర్పాటు చేయాలి, వారి status కొంతవరకు improve చేయాలి అని కూడ ఉన్నది. నాకు ideas ఉన్నవి కాని అవి అన్నీ suspense లో ఉన్నవి. ఆవిషయము వచ్చినప్పుడల్లా, lie over, lie over, అని ప్రతి file మీద వ్రాయడము జరిగింది. ఇప్పుడు మనము విశాలాంధ్రకు ~~పోతున్నాము కదా~~ అక్కడికి వెళ్ళినతరువాత అక్కడ పరిస్థితులు కూడ చూచి, మార్పులు చేస్తే బాగా ఉంటుంది. కొత్తరాష్ట్రానికి వెళ్ళిన తరువాత అక్కడ పరిస్థితులు ఎట్లా ఉన్నవో, మనకు బాగా బోధపడుతాయి. కాని యిప్పుడు ఆ విషయాలు మానివేస్తామని కాదు.

తరువాత దాచేపల్లి Head Constable విషయము కూడ చెప్పారు. నేను నిన్ననే యీ విషయమునకు సంబంధించిన file ను తెప్పించి చూచాను. కాని యింకా further గా పరిశీలించ వలసి యున్నది. అది ఎట్లా జరిగింది, ఏమిజరిగింది, Inspite of Inspectors remarks, యింకా further గా examine చేసి ఏదైనా చర్య తీసుకుంటే న్యాయముగా ఉంటుందేమోనని నా అభిప్రాయము. ఆ ప్రకారము ప్రయత్నముచేసి చూస్తాను.

ఇకపోతే, మిగిలిన విషయాలు ఎన్నో Constables విషయములో చెప్పారు. వారికి ఏవో యిళ్ళు కట్టించి యివ్వాలని, వారికి Daily Allowance, Dearness allowance యింకా increase చేయాలి అని, యిటువంటివి చెప్పారు. వాళ్ళకు యిళ్ళుకట్టించ టానికి తక్కువ వడ్డీకి ఎక్కువగా డబ్బు అంటే ఏ రెండు పర్సెంటు వడ్డీకో అప్పు యివ్వమని కేంద్రప్రభుత్వానికి వ్రాశాము. అక్కడినుంచి తప్పకుండా సహాయము వస్తుందని అనుకుంటున్నాము. అందులో యిక్కడ Home (Police) Department వారు కూడ చాలా ఆసక్తితోనే ఉన్నారు. Constables కు యీ మాత్రపు కొద్ది సౌకర్యాలు అయినా చేయాలనే ఆసక్తితో ఉన్నారు కాబట్టి యీ సంవత్సరపు బడ్జెటులో లేక పోయినను వచ్చేసంవత్సరపు బడ్జెటులోనైనా, యీ building programme తప్పకుండా చేయటానికి వీలు అవుతుంది అని అనుకుంటాను. తరువాత వాళ్ళకు Dearness Allowance, Daily allowance లను increase చేయడమనేది ఎంతవరకు సాధ్యమో నేను యిప్పుడే చెప్పలేను. కాని

Daily Allowance 0–12–0 ల నుంచి కొద్దిగానైనా పెంచాలా, లేదా అనేది మన ఆర్థిక పరిస్థితులనుబట్టి ఉంటుంది. ఏది ఏమైనప్పటికీనీ, యీ పోలీసు డిమాండుమీద చర్చ బాగానే జరిగిందంటే, నన్ను నేనే నమ్మలేకుండా ఉన్నాను. శాసనసభ్యులు చాలామంది యీ పోలీసువాళ్ళను కొంత సానుభూతితో చూడాలని చెప్పినందుకు వ కంకరికీ నేను నమస్కారము చేస్తూ యీ డిమాండ్లను అందరూ ఏ అభ్యంతరము చెప్ప కుండా ఏక గ్రీవముగా వాటిని ఆమోదించమని కోరుతున్నాను.

Sri V VISWESWARA RAO — ఈ మధ్య రాజమండ్రి సబ్ జైలులో కొంతమందికి రక్తవిరోచనములువచ్చి, అక్కడ మందులులేని కారణముచేత, వారికి సరియైనచికిత్స దొరకనందున, కొందరు చనిపోయినారు. ఆ టైములో hunger strike కూడ జరిగిందని అక్కడక్కడ వార్తలు వచ్చినవి. అటువంటి పరిస్థితులు రాకుండా, మందులు సప్లయిచేయటానికి ఏర్పాటుచేయవలసిందిగా మంత్రిగారిని కోరు తున్నాను.

Sri VAVILALA GOPALAKRISHNAYYA — అధ్యక్షా, గుంటూరుకు, సత్తెనపల్లికికలిపి మూడు కోర్టులుపెట్టారు. ఆ విధముగా కాకుండా యిందులో ఒకదానిని సత్తెనపల్లికియిచ్చి, తక్కినవి రెండూ గుంటూరులో ఉండేఏర్పాటు మంత్రిగారు consider చేస్తారా ?

The Hon. Sri N SANJEEVA REDDI — ఈ విషయము రెండుమూడుసార్లు పరిశీలనకు వచ్చింది. అన్నివిషయాలు ఆలోచించాము. సత్తెనపల్లికి మాత్రము వేరుగా ఒకకోర్టు పెట్టినట్లైతే, ఆకోర్టుకు తగినన్ని కేసులు ఉండవు అని హైకోర్టువారు చెప్పారు. విచారణలో యిక్కడ ప్రభుత్వమునకుగూడ అదేఅభిప్రాయము ఏర్పడ్డది పోనీ, ఆ విధంగా లేకపోయిననూ, గుంటూరు కేసులు కొన్ని సత్తెనపల్లి కోర్టుకు transfer చేసి అక్కడ సత్తెనపల్లిలో పెట్టుదామని అనుకొంటే, గుంటూరువాళ్ళకు చాలా inconvenient గా ఉంటుందని తెలిసింది. ఏవో కొద్ది కేసులకోసం, యితరులను inconvenience చేయటము మంచిదికాదు అయినప్పటికి యింకా ఏవైనా కొత్త points ఉంటే, నాకు ఆ విషయములో D. O letter వ్రాయండి. ఆ విషయము ఏదైనా అనుకూలంగా పరిష్కరించటానికి వీలవుతుందేమో చూస్తాను

Sri T LAKSHMINARAYANA REDDI — అధ్యక్షా, అయ్యపు రెడ్డిగారు గుంటూరులోఉండే Advocates కు 10% పని మాత్రమే ఉన్నది, అందువల్ల వారియొక్క talents అన్నీ ఊరకనే waste అయిపోతున్నవని అన్నారు. అలాంటప్పుడు వారియొక్క services ను యింకొక విధముగా వినియోగించటానికి ప్రభుత్వమునకేదైనా ప్రణాళిక ఉన్నదా ?

Mr. SPEAKER — Ask them all to go to Law College.

17th March 1956]

Sri T LAKSHMINARAYANA REDDI :— That is also to be considered, Sir

Mr SPEAKER :— I am putting the cut motion (No 281) of Sri Pillalamarri Venkateswarlu to the vote of the House.

The question is

"To reduce the allotment of Rs 65,83,900/- for administration of Justice by Rs. 100/-.

(To discuss the failure of the Government to check the influence of the Executive over the Judiciary )"

The motion was lost.

Sri S. RANGANATHA MUDALIAR :— Sir, I beg leave of the House to withdraw the cut motion (No 282) moved by me

The cut motion was, by leave of the House, withdrawn

Sri VAVILALA GOPALAKRISHNAYYA :— Sir, I beg leave of the House to withdraw the cut motion (No. 283) moved by me.

The cut motion was, by leave of the House, withdrawn.

Mr. SPEAKER :— Now, the question is :

"That the Government be granted a sum not exceeding Rs 65,83,900/- under Demand XII - Administration of Justice."

The motion was carried and the Grant was made.

DEMAND XIII - JAILS

Mr. SPEAKER :— I will put the cut motion (No. 291) of Sri Pillalamarri Venkateswarlu to the vote of the House.

The question is .

"To reduce the allotment of Rs 24,06,000 for Jails by Rs. 200/-

(To discuss the failure of the Government to effect Jail reforms )"

The cut motion was lost

Sri VAVILALA GOPALAKRISHNAYYA — Sir, I beg leave of the House to withdraw the cut motion No 292) moved by me

The cut motion was, by leave of the House, withdrawn.

Mr SPEAKER — The question is :

"That the Government be granted a sum not exceeding Rs. 24,06,000 under Demand XIII - Jails"

The motion was carried and the Grant was made.

DEMAND XIV - POLICE

Mr. SPEAKER — I am now putting the cut motion (No 303) of Sri S. Vemayya to the vote of the House.

The question is

"To reduce the allotment of Rs 2,71,00,000 for Police by Rs 100/-

(For the failure of the Government to enhance D. A. of Constabulary from Re 0-12-0 to Rs. 2-0-0.)"

The motion was lost.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :— Sir, I beg leave of the House to withdraw the cut motion No 305) moved by me.

The cut motion was, by leave of the House, withdrawn

Mr SPEAKER :— I will now put the cut motion (No 306) of Sri Pillalamarri Venkateswarlu to the vote of the House.

The question is ·

"To reduce the allotment of Rs. 2,71,00,000/- for Police by Rs. 100/-

(To discuss the harassment caused by the Police authorities to the citizens in day-to-day administration.)"

The cut motion was lost.

Mr. SPEAKER :— The hon Member Sri M. Nagi Reddi is not in the House and the cut motions (Nos. 307 & 308) will be deemed to have been withdrawn.

Sri S. RANGANATHA MUDALIAR :— Sir, I beg leave of the House to withdraw the cut motion (No 212) moved by me.

The cut motion was, by leave of the House, withdrawn

17th March 1956]

Mr SPEAKER .— I will now put the cut motion (No 315, of Sri M. Satyanarayana Raju to the vote of the House

The question is ·

"To reduce the allotment of Rs 2,71,00,000/- for Police by Rs. 100/-

(For the failure of the Government to conduct the administration of law and order properly )

The motion was lost.

Mr. SPEAKER — The Hon. Member Sri B. Rama Reddi is not in the House and his cut motion (No. 318) will be deemed to have been withdrawn

Now, the question is .

" That the Government be granted a sum not exceeding Rs 2,71,00,000/- under Demand XIV - Police."

The motion was carried and the Grant was made.

The House will now adjourn and meet again at 8-30 A. M. on Monday, 19th March, 1956.

The House then adjourned.